ప్రత్యూష ప్రచురణము ౧౪.

# అశోకరాజ్యము

రచయిత :

శేషుబాబు

పీఠికాకర్త :

నవ్యాంధ్ర కవిబ్రహ్మ, ఆంధ్రషెల్లి,

ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు.

కృతిభర్త :

కవిసమ్రాట్టు, ప్రౌఢకవి

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.

ముద్రాపకులు :

రామా ప్రెస్, సికింద్రాబాదు (ద.)

ప్రకాశకులు :

సాధన సమితి.

సికింద్రాబాదు (దక్షిణ).

# మనవి

......నాట్యక...[illegible] త్తల (ఆంధ్రనాటక కళాపరిషత్తు) పరీక్ష కాగిన, "నవాంధ్ర కవిబ్రహ్మ" నాణెం చేసి యిచ్చిన "[illegible]" అను ఈనూత్న కుసుమమును రచయిత "[illegible]ట్టు" కు అర్పించుకొనబోవుచుండగా ఆ అంజలిని మాఅంజలిలో ఉంచి లోకమునకును అందించు కొంటున్నాము. ఈదివ్య కుసుమమును మా "ప్రత్యూష" మాలికలో 14 వదిగా గ్రుచ్చుకొని గర్వించుచున్నాము. ఈకావ్యం విశ్వశ్రేయమునకు కాకపోయినను దేశోపయోగమయినచో కృతజ్ఞులముకాగలము. వచ్చే 'కథలు'ను అభిమానింతురనిఆశ.

[illegible] సాధన సమితి, నెల్లూరి కేశవస్వామి,
పార్థివ సంక్రాంతి. కార్యదర్శి.



---

సమైక్య సంస్కృతి సాధన సమితి కార్యనిర్వాహకవర్గము

శ్రీ బూర్గుల రంగనాధరావు : అధ్యక్షులు
శ్రీ జమ్మలమడక పూర్ణచంద్రరావు : ఉపాధ్యక్షులు
శ్రీ నెల్లూరు కేశవస్వామి : కార్యదర్శి
శ్రీ సింగరాజు లింగమూర్తి : స. కార్యదర్శి
శ్రీ పిల్లలమఱ్ఱి హనుమంతరావు
శ్రీ మానూరి వెంకటశేషగిరిరావు
శ్రీ భాగి నారాయణమూర్తి : సంపాదకవర్గ సభ్యులు
శ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావు : ఆడిటరు

# గురుదక్షిణ

## ప్రౌఢకవి, విశ్వనాథ కవిసమ్రాట్టునకు

కాళిదాస కవితాఝురి పులకెత్తి వె
ల్వడె కాళికృప యేరువాక కాగ
భోజచంద్ర జ్యోత్స్నఫలకలో చీకటి
తలజారి మెదడుల వెలుగుక్రిమ్మె
మాసివాడల సామగాన ప్రభావము
శుకకంఠవీణల శ్రుతులుచేసె
పరబుద్ధ బోధాప్రభాకర స్పర్శకు
నెదతామరలు మధువేచి విరిసె
ఇతని కవితాప్రశంతికి నేరుష్కాక
వీని శ్రీ శ్రోతమనస్సుకు విధువరమ్ము
ఈ మనోవీణ పలుకుల కెలిమి మెట్టు
వీని తలపుతేనెల పులకానువృష్టి



ఔరా! సామ్రాజ్యభావ గర్భారియగునె!
ప్రజలనుండి సమ్రాడ్వంది పలికినాడు
ప్రజల కంఠములోవాని పదముకడిగి
వీడు సమ్రాట్టునకు సింహపీఠిపఱచె!

పిల్లమేకకు పులి పెంపుతల్లి వంటి
యుగయుగము నాటి సమ్రాట్టు నొకనియొక్క
బట్టుగంటు వాయింపించె ప్రజలచేత

ప్రజల భావములకు పొందుపడని కవిత
వ్రాసి వారిపై రుద్దగా వచ్చునట్టి
యొక్క సమ్రాట్టునకు నజరుంచినాడు

ప్రజల ప్రతినిధి ననుకొని వారికొఱకె
వారి ఖాలించి లోపముల్ పట్టువారి
సత్కరించి, దిద్దుకొనుచు చున్న ఆప్ర
జాగత్ప్రాణి, యుగతార,—మాగధపతి
ప్రజయదృష్ట మశిక్షిత ప్రతిభనమ్మి
వర్గబహు నాయకమునకుం బలియొనర్చి
జడిసి, తుద—నియంతృతలోను జయముగనెత
దారి తడవెడు చీకటిం తారకాడో?!

భౌతికాతీత రసకళా బ్రహ్మమొకటి
జీవిత స్పృష్ట కూలంకషగ మఱొకటి
ధరణి సాహిత్య సారస్వతముల యొక్క
అందము దెల్పె సర్వస్రష్టై కొంతవఱకు

---



# ఆశీస్సు

గురుదేవులు

విశ్వనాథకవి సమ్రాట్టు

మానూరి కులము కడలికి
లేనెలవై యమృతవీచి లీలాకృతివై
పూని పదిదెసల కీరితి
గోనుము సుకవితాస్రవంతి కొనసవరిపూవై
శ్రీయును నాయువు సుతులును
ధీయుత వాణియు సదా వధీకృత పాండి
త్యాయతియు కళామర్మ
జ్ఞేయతయు ఘటిల్లుగాక శేషగిరి : సుతా !
'గురుదక్షిణ' తో నా కొక
గురుత ఘటించితి వదృష్టకోటికి నెక్కన్
పరమ వినయరేఖా ని
ర్ఝర ఫలితముగాగ సిరి యొసంగుత నీకున్.

## నా మాట

ఈరూపకమున కంకురార్పణ యశస్వినియైన సంతోష కుమారీదేవిది. అది 1936. 'తిష్యాశోక' అను పేరుతో 1944 సం॥ బందరులో జరిగిన 'ఆంధ్రనాటక కళాపరిషత్తు' వారిచే ఎన్నికయు, ప్రదర్శనావకాశమును పొందినది. రచన యొక్కువభాగము 1943 లో సాగినది. ప్రతిదినము వచ్చి, ఏదినమున వ్రాసిన రంగము లాదినమున వినిని, ప్రోత్సహించుచు వచ్చిన కవిమిత్రుడు శ్రీ వేమూరి వెంకటరామనాథం, ఆజన్మ నటుడు శ్రీ కొండముది కృష్ణారావు, సంగీత నిపుణుడు శ్రీ జమ్మలమడక రామచంద్రరావుగార్లకు నాకృతజ్ఞత.

నా వ్రాసిన పాటలు, గేయములు ఎప్పటికప్పుడు స్వరమువేసి, తన సహజ మధుర స్వరముతో పాడి, వినిపించి,

ఆనందోత్సాహములు కల్గించెడివాడు మిత్రుడు రామ చంద్రరావు.

నారచనను నావలసనే - మొదటినుండి ముగింపువఱకు ఏకబిగువున కూర్చుండి- విని, ప్రకటనయోగ్యమని, ప్రదర్శ నార్హమని, శెలవిచ్చిన గురుదేవుడు శ్రీవిశ్వనాధకవిసమ్రాట్టు, నవ్యాంధ్ర కవిబ్రహ్మ, ఆంధ్రషెల్లి అనికీర్తిగడించిన ఆచార్య శ్రీ రాయప్రోలు మహాకవులు, డాక్టర్ పి. శ్రీనివాసాచార్యులు గారు, శ్రీ పాటిబండ మాధవశర్మగారు, శ్రీ డి. వి. సుబ్బా రావుగారు, శ్రీ పింగళి నాగేంద్రరావుగారు, శ్రీ కందికొండ సత్యనారాయణశాస్త్రిగారు, శ్రీ ఆవటపల్లి హనుమంతరావు గారు, శ్రీ రాళ్ళభండ సీతారామశాస్త్రిగారు, శిరోమణి శ్రీ శృంగారం, శ్రీనివాస రంగాచార్యులుగారు, శ్రీ రావూరి సత్య నారాయణగారు మొదలయిన నాట్య కళాపేత్త లందఱికిని నా కైమోడ్పులు.

దీనిని ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఎదుట ప్రదర్శించు టకు వలయు సాధనసామగ్రి నంతను సమకూర్చి యనుగ్రహిం చిన శ్రీ చల్లపల్లి ప్రభువ రేణ్యులకు, వారి దివాన్లకును, ప్రదర్శిం చిన శ్రీమంతునాటకమండలివారికిని నా కృతజ్ఞత.

తమ 'విశ్వభారతి' దృష్టితో తిలకించి, ఈకృతికి పీఠిక అనుగ్రహించిన శ్రీ రాయప్రోలు మహాకవులకు నా హృదయ పూర్వకాభివందనములు.

సాహితీప్రేమ కలిగించి, పెద్దను కా దీవించిన గురు

దేవుడు శ్రీ విశ్వనాథకవి సమ్రాట్టు—యథాశక్తి గురుదక్షిణ సమర్పించుకొను—నా యీ చిన్ని రూపకమును స్వీకరించ నను గ్రహించినందులకు వారికి నా ప్రణామములు. ఆసందర్భమున శ్రీ అడుసుమిల్లి వెంకట దత్తాత్రేయశర్మగారి దర్శకత్వమున కొన్ని రంగములు ప్రదర్శించి, ఉత్సవమును విజయవంతము గావించుటలో తోడ్పడిన శ్రీ ఆంధ్రనాట్య కళాసమితి వారికి చేమోడ్పులు. హైదాబాదు ఆంధ్రనాటకకళాపరిషత్ ప్రారంభోత్సవ కార్యక్రమములో ఈ నాకృతి ప్రదానమును జేర్చి, ఆవిష్కరించి గౌరవింపించిన పరిష త్కార్యదర్శులు శ్రీ నండూరి నారాయణరావు, శ్రీ భాస్కరభొట్ల కృష్ణారావు గార్లకు నానమస్సులు.

ప్రత్యూష, ప్రచురణమాలలో నొకటిగా దీనిని అంగీకరించి ప్రకటించుచున్న మా 'సాధనసమితి' వందనీయము.

అడుగడుగుకు ఉత్సాహపఱచుచువచ్చిన నా ప్రాణబంధువు శ్రీ పత్రి వెంకటరమణారావు పంతులుగారికి కేలోడ్పులు.

భాగ్యనగరము, }
పార్థివ }

ఇట్లు,
శేషు బాబు.

## సర్వస్వామ్యములు రచయితవి.

ఈనాటకము ప్రదర్శించుటకు రచయితయొక్క లిఖిత రూపకమగు అనుమతి కావలయును.

# పీఠిక

(నవ్యాంధ్ర కవిబ్రహ్మ ఆంధ్రషెల్లీ,
ఆచార్య, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు
ఉస్మానియా విశ్వవిద్యాలయము.)

మానవజీవితము సుఖదుఃఖ పర్యాయంగా ఉన్నది. జగత్తులో రక్తసంబంధరక్తి గలది కుటుంబము. సమానాభిమతిబద్ధమయినది సమాజము. ప్రభుశాసనాధికార ప్రధానమయినది రాజ్యము. ఈ మూడింటను అనుస్యూతంగా వ్యాపించి ఉన్నది మానవజీవితం.

వర్ణవ్యవస్థ ఆనుపూర్వ్యవంశ వర్చస్సును నిలపడానికి మత ప్రతిష్ఠలు ధర్మసాధనను అస్ఖలితంగా కాపాడడానికి రాజ్యాంగ నిర్వహణం దేశసౌభాగ్యాన్ని రక్షించడానికి మానవబుద్ధి విశేషం కల్పించిన బలిష్ఠతంత్రాలు.

రాజ్యం శోకరహితంగా ఉంటే రాజ్యంలో ఉండే ప్రజాజీవితంకూడా ముక్తశోకం కావడంసహజం. ఈ రూపకం శోకములేని రాజ్యస్వరూపమును ప్రదర్శిస్తుంది.

ఇందలి పాత్రలన్నియు ఒక్క తిష్యరక్షితతప్ప, చాల ఉచ్చాదర్శములు కలిగి ప్రకృతికి, ముఖ్యముగా ఆకాలము దాను మించియున్నట్లు గోచరించును. 'ప్రజల క్షేమమునకై యేనేను జీవింతును. అందునాకలసటకాని, తుష్టికాని ఉండ' దనువాడు చక్రవర్తి. "మానవత్వమున మకుటమెత్తెదము.

రమ్మని పిలుమవా. యువరాజు. అట్టి చక్రవర్తిని, కాబోగ చక్రవర్తుల, వారికొటు బయిను 'భక్తుని భగవత్పాదిదేవము' వలె వెన్నంటి కాపాడు, దేశీయులను వారి ఆదర్శముల కనుగుణముగా సాధించుట — అవి జీవితాశయములుగా గలవాడు. మరి, సామ్రాజ్యవాద మనినంతనే నేటికాలపు భావము కల్పించుకొనరా మీరు? ప్రపంచమునందలి యేలికలందఱు నిట్టి వారే యైనచో ప్రస్తుత పరిణామమున 'సామ్యవాద' 'ప్రజాస్వామ్యవాదము' లను వాదములు పుట్టియుండెడివే కావేమొ! అన్నచో అట్టివాదములకే లోకములో స్థానముండెడిది కాదు కదా !

స్త్రీ పుంసయోగోత్సవంగా ప్రజాలోకం ప్రబలింది. అనాటివ్యవస్థలో గృహమేధి స్థానము ఏర్పడింది, గృహమేధివర్గములోనుండి కులవృద్ధులు వెలిసిరి. ఆహార విహార క్రమవర్తనలకు, ఆచారవ్యవహార నిర్వాహణ నియమములకు ఆదియందుగు కులవృద్ధులే కారకులు. అందువల్లనే స్మృతులన్ని చాలవఱకు వృద్ధవాక్యాలమీద ఆధారపడడం మనము చూస్తున్నాము.

ఈ రూపకంలోని అర్థాత్రయకర్త అట్టి కులవృద్ధు. చాణక్యసృష్టియైన మౌర్యసామ్రాజ్యముయొక్క ఉద్దేశ్యము నెఱిగినవాడు. బిందుసారుని తరమునుండియు ఆ ఆదర్శమును రాజుచే నిర్వహింపజేయుచున్నవాడు. యువరాజు సుమను, నిలో లేనిరాజును అశోకునిలోనూ 'ప్రియదర్శి' లో దాఆ కని రాజును కుణాలునిలోను గుర్తించి, వారికి బలముచేసి

కులజ్యోతి నారిపోకుండ పెచ్చినవాడు, మరియు ప్రజలచే నా జ్యోతికి ఆరాధనలు చేయించినవాడుకూడ. అహింసాయుధ ప్రాశస్త్యము గుర్తించలేక కాదు, అది ఆ బి. సి. లలో ప్రయోగ శక్యము కాదనియే. ఒకవంక రాజును సంస్కరింప జూచుచు, మరొకవంక ప్రజలలో రాజభక్తిని దేశభక్తితో సమన్వయపరచి ప్రజ్వలింపజేయుచు, దేశములో ప్రజ్వలించిన అపూర్వోత్తేజమునూ అశోకుని ధర్మసంస్థలయెడ ప్రజలకు కలిగిన వైమనస్యమునూ అశోకునియెడ నుదాసీనతగా మార్చి స్వాకాంక్షా ప్రాప్తికి ఉపయోగించుకొన జూచుచున్న ఆ 'అశోక రాజ్యపు చీడపురుగు' తిష్యరక్షిత బ్రతుకు బైట పెట్టినాడు.

కుటుంబకేంద్రము కులచక్రంగా విస్తరిల్లింది. ఆచారాదులు ఆద్యస్థానంలో నిలిచినా వ్యవహారికాండ బహుజన పర్యాలోచనంలో చిక్కుకొన్నది. అనంతమైన జ్యోతిర్మండలిలో అద్వితీయంగా ప్రకాశించు సూర్యుడు గ్రహపతియైనట్లే అపారమయిన జనచక్రమునందు ఏకైకంగా రాణిల్ల గలిగిన ప్రధానపురుషుడు రాజైనాడు. ఇదిరాజరాజ్యవ్యవస్థ. దీనిపరిణామం అద్భుతంగా కనిపిస్తుంది.

రాజ్యాంగానికి రక్షణశిక్షణలు రెండు ప్రధానాంశలు. మొత్తానికి రక్షణకోసమో శిక్షణకోసమో యుద్ధంతప్పలేదు. కులకాంతాపహరణ మనే నేరమునకు శిక్షగా రామరావణ యుద్ధంజరుగుతే, రాజ్యంలో తమ సాబాలు రక్షించుకోవడమునకై కురుపాండవ సమరంసాగింది. ఇలా విచక్షించుకో వచ్చు యుద్ధాల నన్నిటినీ.

యుద్ధమంటేనే హింస. నెత్తురు వఱద కట్టుతుంది. మేధోమాంసములు రాసులుపడతవి. మృత్యువు వెన్ను విఱిచి విహరిస్తుంది. శోకసంఘోషంతో లోకకంఠమే పగిలిపోతుంది. అయినా యింత భయంకర ఘోరఘోషకు నరుడు నడుముకట్టి నడుస్తున్నాడు తరతరాలుగా. ఎందుకోసము? 'లోకంలో న్యాయానికి రక్షణమూ, అన్యాయానికి శిక్షణము లేదు' అనే శోకంలేకుండా చేయడానికి. ఈ పరమప్రయోజనం ఎంత వఱకు సిద్ధించిందనేదే ప్రశ్న.

అశోకుడు మహారాజు. ఉదాత్తమైన ప్రజాలోక ప్రశాంతియే అతని ఆదర్శము. దేశమంతయు నొకేసామ్రాజ్య పతాకముక్రింద నుండుట దాని కది బలమునియు, వైదేశిక శత్రువులెట్టి దేశమును తేరిచూడనైన లేరనియు చంద్రగుప్తుడు గ్రహించిన సూత్రములో అతని మనుమడగు అశోకునికినీ విశ్వాసము. ఫలసిద్ధికై క్షత్రియ సంప్రదాయమునే అనుసరించాడు. దిగ్విజయము అయింది. తాను అవలంబించిన ఉగ్రయుద్ధసాధనవల్ల ఉప్పతిలిన శోకము లోకశోకాన్ని ఇనుమడించిన దురవస్థను చూచాడు. అతని ఆత్మాంతరాళము పశ్చాత్తాపదవానలముతో పరితప్తమై అరుణారుణమై, కరుణాతరుణమై తేరింది. కత్తితో కట్టిన సామ్రాజ్యపు పునాదుల క్రింద శోకం పుట్టలుపెట్టుకొని పెరుగుతుందని తెలుసుకొన్నాడు. ఉపగుప్తముని బుద్ధప్రభావంకూడా అతనిహృదయాన్ని సత్వర పరివర్తనకు తెచ్చినది. కళింగ యుద్ధముతో ఆ సంప్రదాయం విసర్జించాడు. భిన్నప్రకారాలు అన్వేషిం

చాలు; ప్రజలదుఃఖానికి అన్నవస్త్రలోపము మూలమనీ, చిత్తక్షోభకు బోధాభావము కారణమనీ తేల్చుకొన్నాడు. ఈ రెంటిన్నీ పుష్కలంగా లభించే కట్టుదిట్టములు రాజ్యమందు అంతటా చేసాడు. ఈమార్గ పరివర్తనమే 'అశోక రాజ్యం'లో అమృతప్రాయంగా లీనమైఉన్నది.

అశోకుడు బి. సి. లనాటి వ్యక్తి. కాని యిన్ని వేల సంవత్సరములకు తరువాత నేటికినీ అందని ప్రగతిశాలి. రాజ్యసంపాదన, రక్షణ, పాలన వీనికి అహింసాయుధ మెంత వఱకు పనికివచ్చునా యని యిప్పటికినీ తర్జనభర్జన జరుగు చున్నదే! ఇట్టి ప్రేమాస్త్రముతో ఆనాడే అతడు ప్రయోగము చేసియుండెను. ఫలితము?

"ప్రకృతిసిద్ధ దుర్వ్యాఘ్ర ప్రపంచతలిని బౌద్ధసంస్కృతిన్ సాధువు పడినగోవు భరతధాత్రి మాటకు విల్వవచ్చు నెట్లు? ఆయుధవిహీనునా ఆయుధాభిశస్త్రి!" అనిపించుకొన్నాడు 'మగధ విహారమై మగకేశరమ్మంత వీరవిహారమై"నప్పుడు అతని ప్రయోగమునకు ఎట్టిఫలితమురావలెనో అదేవచ్చినది.

"శుద్ధోదనుడు కత్తితో జయించలేని, జయించి నిలబెట్టుకొనలేని రాజ్యములలో సిద్ధార్థుడు స్థాపించిన ధార్మిక సామ్రాజ్యము అమరత్వము ఘటించుకొన్నది" కదా? నేడు ప్రాక్ప్రపంచమంతయు బౌద్ధమే! మఱి గ్రీకు సామ్రాజ్య మేది ?

అశోకుడు సామ్రాజ్యయుగమువాడే. కాని, "ప్రజల ప్రతినిధి ననుకొని, వారికొఱకె వారి బాలించి, లోపముల్

బట్టువారిసత్కరించి, ఒద్దుకొనుచు చున్న'' ఆ ప్రజాగత ప్రాప యుగతారయే! అతని ఆదర్శము ''ప్రజయుద్ధృష్టమిశిక్షిత ప్రశోభ సమ్మి, వర్గవిహాస వాయస మునకు బలియొనర్చ జడిసి, కొంద సయంత్రితలోను ఆయుము గనక దారి తడవుకొనుచున్న నేటి ప్రపంచమున కెంతటి యూరటగొల్పును!'' బి. సి. ల నాడు తానెందులకు పుట్టినాయని వాపోయినాడు అహింసాలయోన్నత భావశిఖరి నుండి. క్రింద చుట్టునున్న మానవప్రపంచమును జూచి.

కుణాలునిపై పుత్రవాత్సల్యమే కాక గౌరవమునున్నది. కుమారుని ఒక్కొక్క సూచనలో ఒక్కొక్క శతవర్షజీవితానుభవ మగుపించెడి వానికి.

అతని రెండు లోపములు మాత్రము అతడే కాలప్రవాహమో పట్టియిచ్చును. ధర్మసత్రములు, నిరుద్యోగభృతులు కల్పించి తనధర్మమునకు 'ఘనముచాలునా?' అనిచింతించినాడు. తుద కదియొక వెఱ్ఱిగా పరిణమించి తన సామ్రాజ్యము నంతను భిక్షువులకు ధారాదత్తము చేయబోయినాడు. ప్రజలకు జీవనోపాధులు కల్పించి, వారిప్రాణములతోపాటు ఆత్మాభిమానమును కూడ నిలుపవలెనే కాని, దానధర్మములు చేసి, వారి యాకలి తీర్చిన ప్రయోజనమా? ఇంకొకటి. ప్రజలధనమును తిరిగి వారికే సౌకర్యముల రూపమున యీయవలెను. అట్లు చేయక తన మతోన్మాదమును ధర్మాడంబరమును తృప్తి పఱచుకొనబోయెను. ఈ ధర్మసూక్ష్మమును కులవృద్ధు అగ్నిమిత్ర యశస్వి చెప్పవలసివచ్చెను. అంతియే కాదు. ''తథాగతుని అవతారకార్యమున కాలముబుచ్చుకొనంగ నిచ్చుపద్ధతిని'' తన

పాపాత్మ స్వసుగుణ ప్రేమములు ప్రేరేపి, తిష్యరక్షిత కొనగుబ్బలో సంక్షోభించవా. అతని స్వజాతినిష్ఠ ప్రజాప్రేమను కూడా క్షమించి ...స్వప్న ...గోవా. ...కి రెండు పుణ్యపనములే అతని జీవర్య విచ్ఛిన్నానికి ...ముసను కారణములైనవి.

తిష్యరక్షిత సామ్రాజ్యకాంక్ష, సౌందర్య గర్వము సర్వస్వరంగా తొణికిసలాడుతున్న రాజపుత్రి. మొట్టమొదట రాజ్యదాహము తీర్చుకోవడం కోసమే నిజసౌందర్యాన్ని మోహనోపకరణంగా వినియోగించుకొన్నది. కుణాలు కామనీయ సంనివేశం కలిగింది. సౌందర్యం సౌందర్యంతో అనువిద్ధమయింది 'అథవా మృదువస్తు హింసితుమ్ మృదునైవారభతే ప్రజాంతకః' అంటాడు చైతన్యరహస్యవేత్త మహాకవి కాళిదాసు. దీని పరిణామం చాలా చిత్రమైనది. ఈరూపకంలో చక్కగా చిత్రితమై మహత్తరమైన ఒక పరమార్థము ధ్వనింపజేస్తున్నది. రాజ్యదాహంలో తామసలాలస తీవరించడం ప్రణయ పిపాసలో రాజసలాలస రంజించడం—గమనింపదగినవి. అయితే తామసం అధమం. రాజసం మధ్యమం. మొదటిది అధఃపాతం కావడానికి, రెండవది ఊర్ధ్వప్రగతిని పొందడానికి సులభావకాశములున్నవి. తిష్యరక్షితలో సకల ప్రాణి సులభమైన ప్రణయాంశ తీక్షణపిపాసగా తీవరించి ఉత్తరోత్తర క్షోభకు కారణం కావడమూ, అదే ప్రణయ స్పృహ హేమునూలలో ప్రసన్నప్రతిపత్తిగా అమలామల సాంత్వనకు సాధనం కావడం భావావలోకనంలో ఉన్మీలనములయ్యే ప్రబుద్ధరేఖలు.

తిష్యరక్షితలో సౌందర్యపిపాస, పురుష కాంక్ష ఉండి, ఆమెయొక్క సామ్రాజ్యకాంక్ష దానివెన్నంటి ప్రబలిన రక్తదాహములతో ఆమెయొక రాక్షసి కావలసిన పరిణామమునుండి కాపాడినవి. అశోకుని బలహీనత యొక్కదానో గ్రహించి, అతనినక్కడపట్టి, నేపథ్యమునకు నెట్టి, రాజ్యసూత్రములు తాను తీసికొన్నది. దశరథుని వరములను కైకవలె అశోకుని పూర్వవర మొకదానిని—దాచుకొన్నదానిని—తన కనుకూల పరిస్థితు లేర్పడినప్పుడు వాడుకొన్నది. అశోకుని కరుణాహృదయమామెకు స్త్రైణమేకాదునపుంసకత్వముగా తోచినది. సామ్రాజ్యవాదము యొక్క నేటినిర్వచన మీామె విధానమునెడ సరిపోవునేమొ!

ఆత్మకాంక్షావాప్తికై రాజుకు ప్రజలకుమధ్య, హేమమాలకు కుణాలునికి మధ్య నిలిచినది. అర్హతయశస్వి కనుక రాజకుటుంబమునకు, దేశమునకు నొక రక్షక శక్తిగా నిలువక పోయినచో సర్వనాశనము చేసెడిదే.

ఉన్నతాదర్శ సందర్శనమున నప్పుడప్పుడు ఆమెహృదయము కదలకపోలేదు. బోనులోసింహమువలె చిక్కిపోయినప్పుడు అభిమానికావున ఆత్మహత్య చేసికొన్నది. తనమరణబాధలో లోకబాధ అర్థమైనదికాబోలు! పశ్చాత్తాపపడి ఆత్మావిష్కరణము గావించుకొనుటయే కాక రథగుప్తునెడ రాజుకు పత్రాకుకూడ తెలిపి యేగినది. తనదుష్ట చరిత్రమును భారతచరిత్రలో చేర్చవద్దని ప్రార్థించినదికూడ.

కుణాలుడు, హేమమాల జంట తారల వెలుగునలెనే అవిభాజ్యులు. బాటసారులను సంబోధించి ఒకవృద్ధ భిక్షుకు డన్న "మీకీర్తి హేమాకుణాలుర జంటకీర్తులవలెనే ఆర్తుల హృదయాలలో ప్రాకాలిస్వామీ"—నుగమనించినచో వారి ఏకాదర్శమూలమైన సాహచర్య మర్థమగును. అశోకుడు కళింగమును దండయాత్రమూలమున జయించబోయినప్పుడు కేవలము ఆదర్శప్రబోధముతోడనే ఆ కార్యమును సాధించ ప్రయత్నించినది హేమమాల.

పరాన్నము, పరాధారము, సోమరితనము, విషయ లాలస,పతనము—ఈ పరిణామము తెలిసి,ప్రజలలో ప్రజలుగా తిరిగి వారిలో ఆత్మాభిమానము, పరిశ్రమా గౌరవము రేకెత్తించినారు. ప్రజలలో 'అభిమానము చంపుకొని బ్రతు కుటకంటే, అభిమానముతో మరణించెదము' అన్న భావము నకు వీరుకర్తలు కొంతవఱకు. అశోకునితమనెంటనోనిపోయి, ఆయన పాలననెడ ప్రజాభిప్రాయ మెట్లుండెనో చూపెడి వారు. 'త్యాగమునెంతో మోహించీ, తనుణముకోఱకై తపియించీ, సేవాన్వేషణచేసేమా?' అనేదేవారి జీవితాధారము. "చక్రవర్తి పుత్రుడవయ్యీ బీదరికమునే మోహించిన నీఆదర్శ మెవరిని మోహపెట్టు"దన్న మహామంత్రి అర్హతయశస్వీ వచ నము వారికొక యోగ్యతాపత్రము. మఱివారి జీవితాదర్శ ముల కంతరాయము కల్గినపుడు

'లోకముల వెల్గించు లోక బాంధవులను
ఏ గుహాలలోపలనో, ఏచీకటులలోనో

బ్రతుకు లిటులీడ్వగా బడవేసియున్నారు' అని బాలుకలుగ దుఃఖించి శ్రోతల నా సాగరమున ముంచినారు.

కుణాలుడే రాజయిన ఆదినములలోనే దేశమొక సామ్యవాదఖండ మయ్యెడిదేమొ!

కుణాలుడొక త్యాగమూర్తి. కాలినసలాకలతో గ్రుడ్లు తోడెదనను కింకరునితో ముందు తిష్యరక్షిత నిలబడినప్పుడు "మాతృమోహకములు కూడనయిన యీనయన సౌందర్య మణగి పోవలసినదే! లోకముయొక్క ఆదర్శస్థానమునుండి తల్లినిజార్చు ఈనయన జ్యోతులారవలసినవే!" అనుట! "జననినే అపార్థము చేసికొనరాదు. అనుమతింతమిష్టముపైన!" అని హేమతో చెప్పుకొనుటకు శెలవు వేడుకొనుట!! ఆ త్యాగ మహాత్మునకా రాతసిప్రాణములుసిగ్గుచే మెలితిరిగిపోయినవి.

హేమమాల తిష్యరక్షితకు ఆదిలోనే "భారతకీర్తి మయూఖపాళి కేకాక ప్రశస్త కేంద్రము సుమా! మహార్హతతో నిలబెట్టుకొమ్మ" అని ప్రబోధించినది. 'భారతమాతృపూజార్థ' మది పనికిరాదని తోచినంతనే 'పరిపురుగన్న నిషముగా' త్రోసివేయించినది సింహాసనమునుండి.

ఆ దినములలోని ప్రజలసమూహము, వృద్ధభిక్షువు లుదాహరణప్రాయులు. 'స్వసంపాదన కానిది మాకిముడదు. గొంతు దిగనైనా దిగదు. అభిమానం చంపుకొని బ్రతుకుట కంటే అభిమానంతో మరణింతము. అతిదయాపరుల ధర్మబుద్ధి ఫలితాలే మా భిక్షుకకుటుంబాలన్నీ' ఇవివారి బ్రతుకు

తీరులు. నాథు (అర్హ్వాతయశస్వి) నుండి దేశపుపిలుపు అంది నంతనే నడుముకట్టి జీవనమరణ సమస్యలలోనికి దిగ గలిగినారు.

ఈ రూపకమున లోకమున కందించిన సందేశము లున్నవి. 'తన తంత్రులకు జాతినెత్తురులుదుక' జేయవలసిన వీధిగాయకుడు (bard) 'పొట్టకై కాక తనపాటలను పాడవలె' ననునదియొకటి. అట్లు కానిచో 'సంఘకాయము పట్టునట్టి యొక చీడగా, భిక్షుకునిగా' తలపబడునని బాధ. అహింస రాజకీయములలో విశ్వముయొక్క కొన్ని దత్తపరిస్థితుల లోనే కాని అవలంబనీయము కాదనునదొకటి. ప్రజాస్వా మ్యములోని 'బహునాయకత్వము' 'అశిక్షితవ్యక్తి ప్రాబ ల్యము' మొదలగు లోపములను, నియంతృత్వములోని నిరం కుశత్వ దోషమును—రెంటిని సమాధానపఱచునది 'అశోక రాజత్వమే' ననునదొక సందేశము.

కాంక్ష,కరుణలకు—ధర్మా ధర్మములకు-స్వాతంత్ర్య పిపాస, సామ్రాజ్యకాంక్షలకు—మధ్య రేగిన ఆమహాసంఘర్ష ణలో వ్యక్తులు రక్షింపబడిరేకాని, అశోకుని 'ఆదర్శ— అశోకరాజ్యము' నిలువలేక పోయినది.

శ్రీ శేషగిరిరావుగారి రచనలో ప్రవాహసారళ్యం ఉన్నది. కల్పనలో వలసినంత నైపుణీ సామగ్రి గోచరిస్తుంది. ఇతివృత్తం ఇష్టార్థచిత్రణానికి చక్కగా విన్యస్తమయింది.

నాటకకళావేత్తల మెప్పుపొందిన రూపకాన్ని గురించి ఇతరవిశేషాల ప్రసంగం పునరుక్తి కాకతప్పదు.

బహుకావ్యకర్తలున్నైన శ్రీ విశ్వనాథ కవిసమ్రాట్టుకు ఈ నాటకం గురుదక్షిణగా సమర్పితం కావడం సోదర కవులకు సంతోషదాయకం.

ఇతిహాస గర్భమయిన వృత్తాన్ని ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన సాహిత్యరంగంలో నడిపించడానికి ప్రతిభ కావాలె. ఈ కవిలో ఆ రేఖ ఉన్నది. ఇతోధికంగా సమున్మీలనం పొందుతుందని ఆశించుచున్నాను.

పార్థివ సం.
పుష్య శు ౧౫

రాయప్రోలు సుబ్బారావు

---

# పాత్రలు

అశోకుడు / ప్రియదర్శి } భారతసమ్రాట్టు.

తిష్యరక్షిత - కళింగపుత్రి భారతసమ్రాజ్ఞి

కుణాలుడు } యువరాజు

అంధగాయకుడు } ప్రజానాయకుడు

హేమమాల (అంధగాయకి) } కుణాలుని సహచరి.

అర్హతయశస్వి } కులవృద్ధు,

నాథు (వీధిగాయకుడు) } మంత్రి.

ప్రవీణ - చెలికత్తె.

ఉపగుప్తుడు - బౌద్ధగురువు

మాధు, వృద్ధభిక్షుకుడు-గ్రామికులు

కింకరులు, పౌరులు, సైనికులు.

## ప్రార్థన.

నమోస్తుతే నటరాజా...నమో॥
లాస్యభారతీ వీణానిస్వన లహరీనాదములో
రాకా విధుకిరణామృత నిర్ఝరలహరీ లాస్యములో ॥ నమో ॥
గ్రహాగమన స్వనస్వరధునిలో, గగనసురాపగ కలకలలో
ప్రగుణచలన సప్తస్వరనాద ప్రాప్తమహితచరణా ॥నమో॥
సా-రి గసా। పాధని పా॥ సా-రిగసా। పా-ధనిపా।
సారిగసా। పాధనిపా। సా-రిగసా। పా-ధనిపా।
రిగసా। ధనిపా। రిగసా। ధనిపా:
దరమధుభావ ప్రకటిత హస్తోపరి విన్యాసవిభో
మానవ జీవిత మధుకృతినేతా ॥నమో॥
ప్రపంచ విస్తృత దివాభంగిమా ॥నమో॥

# అశోక రాజ్యము

## నాంది

### సూత్రధారుడు

శ్రీధరు డుత్తమంబయిన జీవులసృష్టినొనర్చి, వారితో
నీధర నింపగాఁదలచు నెప్పటికప్పుడె; యీశువాంఛ కే
యోధులు తోడ్పడఁగలరొ హా? పశుశక్తిని మించు ప్రేమని
త్యాధికశక్తి దిగ్జయవిధానము నూపుచు ధర్మకేతనుల్!

(నాంద్యంతమున సభ్యులకు పుష్పాంజలి నొసగి)

సంయుక్తతలోనే క్షేమము, సౌఖ్యము నుండునని ప్రపంచమున కర్థమయిన తరువాతకూడ నాదేశమున ఈఅన్నదమ్ముల విభాగవాదమేమొ! విశ్వదేశము లన్నియు కత్తులు నూరుచుండ, మధ్య నేను మాత్రము కొన్నిశతాబ్దముల యనంతర మవలంబనీయమగు అహింసాయుధమును ధరించుటేమొ! దేశములు ప్రజాస్వామ్యము కాదని, నియంతృత లోనికి దిగి, అదికాదని "అశోకరాజరికము" లోనికి రాబోవు ఈదినములలో నేను మఱల ఓనమాలతో మొదలిడ జూచుటేమొ! కుంటికి, గ్రుడ్డికి మాత్రమే తగు భిక్షుక వృత్తికి నాగడ్డపై ప్రజాచైతన్యమును నిలుపవలసిన వీధిగాయకులు (bards) ను దిగుటయేమొ!

### నటి (ప్రవేశించి)

అభివాదములు. ఆర్యపుత్రులెందుకు పిలిచిరి ?

సూత్రధారుడు (నవ్వి)

నేను పిలిచితినా? లేదు. నీహృదయములోని అనువేదన మల్లు తలపించినది.

నటి (పోబోవుచు)

అట్లయిన శెలవు.

సూత్రధారుడు

తెలివి తేటలు ప్రదర్శించకుము. తెరయెప్పుడెత్తుదుమా యనియున్న పరిషద్సభ్యు లెంతకాలమని ఓపిక పట్టగలరు? ఎంతకు ఆత్మవేషధారణమేనా? లేక—

నటి

నేనేమన్నాను? ఉపక్రమణకు శెలవు వేడుచున్నాను. ప్రార్థనానంతరం ప్రథమరంగమునే చూడగోరు సదస్యుల కీమధ్య మన సరాగమెందుకు?

సూత్రధారుడు

నీ నాటకము క్రొత్తది. చారిత్రకపాత్రలగు నీ తిష్యా కుణాలుర అపూర్వ కథనమునుబట్టియే "సారంగధర" కథా సృష్టి జరిగిన దనుటకంటె మరేమియు తెలియని సదస్యులకు ఈనాటకము సగమగువఱకు రంగముపైకి వచ్చుపాత్రలెవరో, ఎందుకు వచ్చుచున్నారో తెలియదని నేను వచ్చితిని. ఇంతలో నీవు వచ్చి... వీరువచ్చినది మనలను చూచుటకా, మన ప్రద ర్శనమును గాంచుటకాయని నేనడుగవలసిన ప్రశ్న నీవడుగు చున్నావు.

తెరలో

వీరకళింగజ్యోతీ వెలుగవె। వీరభూమి స్వాతంత్ర్యము నిలుపవె

నటి

అదిగో! కళింగయోధుల వీరగీతము...... శెలవు, మొదటి రంగము నాదేకూడ.

(ప్రస్థానము.)

సూత్రధారుడు

కిరీటధారణతో మా నటి తిష్యభూమికయు, సర్వము సంసిద్ధముకాబోలు ...ఆసంగతి నాతో తెలుపులక్షణమే కాబో లీ రాద్ధాంతము !

(తెరలో)

వీరకళింగజ్యోతీ వెలుగవె

సూత్రధారుడు (నమస్కరించి)

ఇంక శెలవు, ఇది శేషుబాబు గురుదేవుడు విశ్వనాథ కవిసమ్రాట్టుకు ప్రీతిగాచేసికొన్నరచన.'నవ్యాంధ్రకవిబ్రహ్మ' ఆశీస్సు, నాట్యకళా వేత్తలమెప్పు, ప్రభువుల ఆదరముపొందిన నాటకము! మానటీనటులు కవి నెంతగా వ్యాఖ్యానించ గలుగు దురో రసికులు మీరు నిర్ణయించండి.

(నమస్కారముతో ప్రస్థానము.)

# అశోకరాజ్యము

## ప్రథమాంకము



### ప్రథమరంగము



(కళింగములో యుద్ధభూమి; నేపథ్యమున భేరి;
మొదటి తెరముందుకు పతాకలతో, వరుసలో ప్రవేశించి)

సైనికులు (స్వరమేళ)

వీరకళింగ జ్యోతి వెలుగవె! వీరభూమి స్వాతంత్ర్యము నిలుపవె ॥వీరక॥
దోషమైన సామ్రాజ్యవాద జన దుష్ప్రచారముల దూటడగించీ
ప్రాణత్రాణకు స్వాతంత్ర్యముతో సాటిలక్ష్యమే లేదని చాటీ ॥వీరక॥

(శంఖము నూదుచు ప్రస్థానము)

# ద్వితీయ రంగము

---

(కళింగములోని వీధి. ఆ తెర లేవగా మౌర్య పతాకలతో, ఒక శ్వేత పతాకతో, బాకా లూదుచు ప్రవేశించి)

సైనికులు (స్వరమేళ)

భారతకరి వివిధాంగక భవ్యబలములారా
అవిభక్తతలోన గాదె అంగబలములు ॥భారత॥
దురభిమానమునకు బోయి చెఱుపు దేకుడీ
జననికి అరిపాదరజము సోక నీకుడీ
గ్రీకు కేతనముల ఛాయ తాకనీకుడీ ॥భారత॥
నామ మాత్ర స్వరాట్టుగ నతని బొందుడీ
ప్రాంత పాలనమ్మున నే పాలు గోరడు
వైరి గుంపౌ బల్లెముగా పైకి నిలువుడీ॥ భారత ॥
మాగధ ప్రభు రథ మిప్పుడౌ బయలుదేరెను
మీ మీ రథ సూత్రములను ముడిగవేయుండీ
వెన్ను బలము చేసి పైన ప్రియము గాంచుడీ ॥ భారత ॥
మన రక్త మహాత్వరేఖ మన అశోకుడు
అతని జేరి జన్మభూమి గడ్డ నిలుపుడీ
అతని కేతనముల దేశరక్ష కిట్టుడీ ॥భారత॥

(తిరిగి బాకా ఊదుచు ప్రస్థానము)

# తృతీయరంగము

---

(రెండవ తెరయు లేచును. ఉద్యానవనములో నొక మందిరము, పడగవీపులతో చలువ రాల ఆసనములు; సెజ్జలలో పూబంతులు, దండలు; స్తంభములపై భారతదేశపటము— కళింగము గుర్తించి— ఆశోక, కుణాలుర పటములు; డాలు, కత్తులు; యుద్ధవేషము తీసివేయుచూ ప్రవేశము)

తిష్యరక్షిత

అయినవటే బంతులు, దండలు? (ఒక బంతి తీసి) ఎంతబాగున్నవి దీని పూలు ? (ఎగురవేసి, వదలి) ఎంత కాంతి పేరినదీ రిక్తహృదయ సింహాసనమున ? (నిట్టూర్చి) ఎక్కడకు పోయియుండును చెలి? (మఱొక చెండుదీసి) ఛీ! దీనిపూలప్పుడే విచ్చిపోవుచున్నవే ! (ఎగురవేసి పట్టుకొని) రెంటిలో ఇదే తేలికగా నున్నది. (శిరస్త్రాణము తీసి, క్రింద నుంచి, ఆ చెండును ధరించును) అశోకమౌర్యరాట్సుతులగు సంఘమిత్రాదుల రక్తము నేనే కైకొంటిననియు, అందులో ఈ రక్తపిపాసు వా 'అశోక-నరక' యముని బంధుత్వము, తద్ద్వారమున భారతపీఠము కాంక్షించినదనియు నెవరికి, తెలియును ?...— ఆ దెసనుండియే , ఇంతలోనే ఇంత ప్రళయమారుతమా ? (ఎదుట కళింగదేశపటము జూచి) ఈ విషమ సంఘటనకూడ నా కుపయోగపడవలెను. సరి. స్వయముగ సామ్రాజ్యసైన్యముల కెదురుసేనలు నడిపి, ఆ యోధాగ్రేసరుని హృదయము జూరగొనుచునేయున్నాను. స్వప్రజారక్త

కైంకర్యముతో మాత్రమే భగవత్సాయుజ్య యోగము పట్టకుండు గాక! (ఆసనపు పడగపై ఆని)

కాంక్ష కొఱకే జీవము! కాంక్షలోనే విశ్వము!

హేమమాల (ప్రవేశించి)

సేవయందే సుఖము! మానవసేవా కాంక్షయె సౌఖ్యము!

తిష్యరక్షిత (అందుకొని)

స్వేచ్ఛయె ఎఱుగని ఆత్మలకేనా......? (తల ఎత్తి చూచి)

ఓహో! హేమా, నీవా? కుమారచక్రవర్తి కుణాల చంద్రుని పైటకొంగున కట్టుకొని తిరుగుచుంటివట? అతడంత సులభుడా యేమే?

హేమమాల

ఇదేమక్కా? ఎప్పుడు వచ్చినావసవు? అందఱు సుఖులా అనవు?

తిష్యరక్షిత (చిరునవ్వుతో)

నాకు తెలియనిదేమున్నదే? నీవిప్పుడే వచ్చుచున్నావు. మీచే యుద్ధజ్వాలలోని కీడ్వబడినవారము మేమే కాని, మీరు సుఖులు కాకెట్లుందురు.? కూర్చుండుము మదిగో తిన్నె! నా ప్రశ్నకుత్తర మిచ్చితివే కాదు?

హేమమాల

అక్కా, నిమిత్తజన్మ ననుకొనెడి హేమమాలతో మాటాడుచుంటివి. ప్రజాకార్యనిర్వహణవిధిని సహాయో

ధుల మగుటచే, మా జీవితసామ్యమే మా హృదయములను దగ్గఱకు తెచ్చినది.

తిష్యరక్షిత

అబ్బో !... (నవ్వి) సరే. మఱి నీవు వచ్చినకారణము ?

హేమమాల

ఒక సహాయము కావలెను.

తిష్యరక్షిత

ఉఁ - ఏమది ?... ...

హేమమాల

అంతర్యుద్ధము, ఆత్మీయహత్య లేకయే కేవలము భారతమును శత్రుభీకరము గావించుకొనుటకు, భారతపతాకను దక్షిణభారతమునగూడ నిలుపనెంచి, శుభారంభమునకై కళింగమునకు వచ్చితిమి.

తిష్యరక్షిత (ఆవేశముతో)

ఈ యుద్ధ మెట్లును ఆగును లెమ్ము. నా శౌర్యమునకు ముగ్ధుడై; నా సౌందర్యము గ్రోలి, మత్తెక్కి; నా నృత్తగానముల మైమఱచియున్న రా జెట్లునూ యుద్ధమాపును... చూడుము, హేమ, నీవు యువరాజునే పొందితివి. నేను సమ్రాజ్ఞినే కానుంటిని. అప్పుడు తిరిగి, భారత రక్షణకు కాక, ప్రపంచ దండయాత్రకై యుద్ధము సాగును. తిష్యాశోకులు భారత 'రుక్సానా', 'సికందరు'లు కావలసియున్నది.

హేమమాల (తనలో)

ఈమె మాటలలో నేమొ అశుభము ధ్వనించుచున్నది. ఉపగుప్తముని ఈ రక్తపంకమునుండి అహింసా కిరణములు సృష్టించి భారతికి బౌద్ధ ముకుటము కూర్చనున్నారే? (ప్రకాశముగా) చూడు మాకాశమండలముల లోనికి ధ్రువమండలమువలె ప్రపంచదేశములలోనికి భారతి మున్నతోన్నతస్థానమున నున్నది. దానినిబట్టి లోకములు విశ్వమున తమ స్థానము తెలిసి గమనమార్గములు సరిదిద్దుకోవలెను.

వ్యక్తులు వచ్చి పోయెదరు భారతకీర్తి మయూఖపాళికే
శాక్త ప్రశస్త కేంద్రము సుమా! రుధిరాక్తపదమ్ము పెట్టి, పం
కాక్త మొనర్చి పావనము పవిత్రత తో నిలబెట్టుకొమ్ము సిం
హాక్తము పీఠికిన్ పతన మందెద వీవె అకృత్య మెంచినన్

సోదరు డున్నాడా లోన? (నిష్క్రమించును)

తిష్యరక్షిత

తిష్య కుండు ఆదర్శములు తిష్యకును ఉండునులెమ్ము. (ఆసీనయై, ఆలోచనతో) అతని యందలి నా ప్రేమయే కళింగమును మౌర్యపాదము పట్టించినదని చూపవలెను. త్వరలో కళింగసేనల నుపసంహరించెదను. కాలాశోకుడు నృత్తగాన లోలు డనికదా ప్రసిద్ధి...... నా చెలులలో ఖడ్గచాలన మెటిగినది?... ఆ! కలదుకదా ప్రవీణ... ఆపై నిర్మాణక్రియకు బూనుకొనవచ్చును. (లేచి) బౌద్ధకార్యమును జోడింపబడుటచే నాకును, బౌద్ధభిక్షుకిని కేంద్ర మొకటేయైనది.

అదృష్టవంతులు విషమునందును అమృతము దొరకించు కొందురు... ...కాదు, విషము నమృతము గావించు కొందురు, ఒకదండ తీసికొని, (వేలిమించి (త్రిప్పుచు)

భారత నేత లోనగునెడి భాగ్యమె కల్గిన రాజ్యకాంక్ష యే
తీఱు నదృష్ట మబ్బు: నొక తీఱున నెంతకు నట్లు కానిచో
భారతచక్రవర్తి కొక భార్యగ నేర్పడి, వీరమాతనై
గేరుదు ; మౌర్య భూవిభుని కేలును బట్టినజాలు జన్మకున్

(క్రింది బంతి అందుకొని, గుచ్చుకొనుట నభినయించి)

అబ్బ! పూలలో ముండ్లెందులకో! (అరచేయి చూచుకొని, నిట్టూర్చి) హృదయశాంతికై యుద్ధభూమికే అరిగి స్వపరప్రజాశిథిలముల తిరిగివత్తును. (ప్రస్థానము)

తెర



## చతుర్థ రంగము



(కళింగవీధులు— మౌర్య, కళింగ, పతాకలతో, శ్వేతపతాకతో అశోకుని, భారతదేశపు పటములతో ప్రవేశము వరుసలో)

### కళింగ సైనికులు

వీర కళింగజ్యోతీ, వెలుగవె! చేసె, అఖండ జ్యోతిగ నిలువవె॥వీరక॥
మిత్రహృదయముల స్థైర్యము నించవె! దేశముకొఱకై రాష్ట్రము బలిగా
సర్వభారతము శత్రుభీకరము జేయు తలపుతో శిరము దివుచుకొని॥వీరక॥

(వరుసగా ప్రస్థానము)

పంచమ రంగము



(సాయంసంధ్య— అస్తమించుచున్న సూర్యుని బింబారుణిమ.
అరుణ తిటాకిము—కళింగకోట)

నేపథ్యగానము (శివరంజని)

అరుణవియత్ సుషమా! రుధిర సమిద్ వసుధా!

అశోకుడు (వరాసిన కత్తితో ప్రవేశము)

ఏదీ, ఆ పిశాచి? ఏడీ, ఆ సన్యాసియు నగుపడడే? కతిపయునే తావిష్కరణమాత్రజితసర్వంసహాచక్రుడగు కాలాశోక చక్రవర్తి,......అబ్బ! ఒడలు జలదరించుచున్నది. తుద కొక అబలచేతిలో హతుడయ్యెనన్న దుర్వ్యాప్తి కలిగెడిదికదా! ఎవరికి తెలియును నీ ధీరుడు, విజయోన్మత్తుడు, రణక్రియాకలాప వివర్జితుడు, శాంత్యానందార్థిచిత్తుడునై ఏమరియున్నతరి నా భీరువు దొంగపోటుకు యత్నించెనని? ఛీ! జన్మ! సన్యాసిచేతనా తుదకు రక్షణ బొందుట, కుంజర యూథము దోమ కుత్తుక జొచ్చినట్లు!

నేపథ్యగానము

ఆర్తిద !హా!హా!హా!హా! శోక నినాదాన్విత హృద్భితవధా

అశోకుడు (ఎదుట పరికించి)

ఇవేవో అంతఃపురసీమలుగా దోచుచున్నవి! (కత్తి ఒరలో నుంచి) కంటకశిలబోలు కాలాశోకుని కఠిన హృదయ

మిప్పు కఱుగఁజూపుచున్న దేమి? (ఒక ఱాయిపై కాలూని నిలిచి) ఒక్క క్షణమునకు పూర్వము అసి కవిపినమువలె విజృంభించియున్న కళింగపటాలము లెంకు కటికిపోయినవో? (మారమున పరికించి) గోపురములపై నవి శ్వేతపతాకలా? కళింగుల వీరకంకణములు ప్రాణములతో కలిపికాని విడువరనుకొంటిమే! ఎట్టి శూరరక్తముల కెట్టి యాటు కలిగినది!

తెరలో (పాట)

వీర కళింగ జ్యోతీ వెలుఁగవె! చేరి అఖండ జ్యోతిగ నిలువవె ...

అశోకుడు

అదిగో సామ్రాజ్య గానము వినఁబడుచున్నది! అఖండ భారతసామ్రాజ్యగోపురమున ప్రథమ మంటప మొదవినది! జయధ్వజస్థాపన జరిగినది!

తెరలో (సంగీతము)

ఆ క్రందన! హా! హా! హా! హా! శోక నినాదాన్విత హృద్భేతవధా!

అశోకుడు

రణక్షేత్రమున అర్థమృతుల ఆక్రోశములు, నగరున భగ్నహృదయుల మూగబాధలు! చండాశోకుని కివి శ్రావ్యములు కావా? .. ...సంధిమిత్రావియోగ మీ గండకత్తెర గుండియనుకూడ ఎంత మెత్తబఱచినది? (అరుణ నీరముల ప్రతిబింబము చూచుకొని) నే నెట్లున్నాను? దూరమున సంధ్యాభోజనము సేయు ఆ పిశాచములకును నాకును భేదము? నా ముందీ రక్తతటాక మేమి? ఈ రక్తాశన కుంభ మేమి?

నేను పిశాచములకు విందు చేయుచున్నానా? విజయోత్సవములలోను, ఆదర్శదర్శనములోనుకూడ శాంతి లభించదా?

(తెరలో - గానము)

ఆహా! అశోక పతాక ఛాయ...విశద జన్మభువీ మహాశా!

అశోకుడు

ఏ మా గానము? ప్రకృతి సుందరికూడ సమ్రాట్ గానము చేయుచున్నదా? ఇదేదో హృదయమునకు హృదయపు పిలుపువలె నున్నది! ......ఏదో స్త్రీకంఠగానము... క్షుభిత హృదయమునకు శాంతిగేయము!...గానగాత్రియగు కోకిల పలుకరించిన నెట్లుండును?

(ప్రస్థానము)

(తెరలేచును. ఉద్యాన మందిరము. అశోకవృక్షము కొమ్మలకు హారములు, దండలు తగిలించియుండును. క్రింద అశోకుని పటము—భారతదేశముపై నొక సింహాసనము, దానిపై అశోకుడు కూర్చుండి నట్లు)

(తిష్య కూర్చుండియుండును. అశోకుడు ప్రవేశించి, యొక పాదమాటున నిలుచును. తిష్య అశోకుని గమనించియు, ఎరుగనట్లు నటించి)

తిష్యరక్షిత (స్వగతము)

మంత్రికి సమ్రాట్సమ్ముఖ మబ్బెనో, లేదో? అబ్బినను సంధికి సమ్మతి కుదిరెనో, లేదో? సంధికుదిరినను నా హృదయనివేదన మంగీకరించెనో, లేదో? కయ్యమునకు వచ్చిన వానికి వియ్యమునకు మోము చెల్లునో లేదో? వెంటనే లొంగ లేదనికక్షవహించునేమో?... శౌర్య,వీర్యములుగల సతిని కోర

కుండని యెాధుకుంకునా? అందును, కాలాశోకుడు? భార్యా వియోగి? నా యౌవనము, సౌందర్యము, ప్రణయము, సహకారము, శౌర్యము ఈ నా పూజాద్రవ్యములు నా హృదయ దేవున కంగీకృతములైతీరును.

అశోకుడు (స్వగతము)

ఎవ రీ బంగరు కోయిల? ఏ మీ అయాచిత సమర్పణము!

తిష్యరక్షిత (స్వగతము)

హృదయమా, నీ దేశీయు లింతగా విశ్వాసముంచు కొన్న నీ శూర రేఖ లిట్లుపసంహరించుకొంటివి! వీరకళింగము భీరవైయె కాకున్నను, వీరసేనాపతి తిష్య రాగసంరంభమున విచ్చుటచే విచ్చిపోయినది. ప్రణయయాత్ర నభిలషించిన ప్రణయిని దండయాత్ర నెట్లనధరించునుమటి? ......... అశోకమూర్తి అమిత్ర ఘాతుక రేఖా పరివేషమే కనులు తెఱచినను మూసినను చుట్టు భ్రమించుచున్నది.

ఘనుఁ డశోకసామ్రాజ్య నమిత్రఘాతు నొక్క భారతైకీకరణ కార్య భారమందు

ప్రథమసోపానము రచించు భాగ్యమబ్బ నేమొ పితృమరణము నెద నేచబోదు!

అశోకుడు (తనలో)

ఈమెయే తిష్యరక్షిత కాదుకదా? (వెలువడి ప్రకాశముగా) ప్రణయ తపస్వినీ, నీ వెవరవు? నిస్పృహావలదు. అశోకుడిదిగో స్వయముగ నేసంధినియమములు వినవచ్చినాడు.

తిష్యరక్షిత

(దిగ్గున లేచి, భయసంభ్రమముల జూచి నమస్కరించి)

ఆకారము గొన్న నా ప్రణయతపస్యా, నీచే పితృ, భ్రాతృవియోగిని గావింపబడిన నీ పూజారిని. కళింగపుత్రి, తిష్యను.

(కొన్ని పూలు తీసికొని పాదములపై వదలును.)

ఈహృదయిని యొసగు అర్ఘ్యపాద్యము లంగీకరించుడు. అదిగో ఆ పీఠ మలంకరించుడు.

అశోకుడు

ఓహో! కళింగపుత్రి వేనా? సంతోషము. ఒక దినము క్రింద సేనాముఖమున నిలిచి, మాతో స్వయముగ తలపడి; నొప్పించి మెప్పు బొందితివి— నీలో స్త్రైణ రేఖలు నున్నవా?

తిష్యరక్షిత

అశోకనాథుని మెప్పది భాగ్యము ప్రభూ.

అశోకుడు

భాగ్యము నీ కన్నతండ్రిడిది, నీబాసటగొన్న కళింగముది. నీవుండియు కళింగమున సంధివిచారమున కేమికలిగినది?

తిష్యరక్షిత

నే నుండుటచేత నే అట్లు కలుగనైనది. ద్వేషము దిగ

ద్రావి రాజకుటుంబికులును, ప్రజలును సార్వభౌమి కాహ్వాన మొసగసిద్ధులు.

అశోకుడు

అసలే వెన్నెలచే చల్లబడిన గాలితరగలను మఱింత మధురింపజేయుచు వచ్చిన నీ స్వరలహరి కాహ్లాదింపబడితిమి. ఇంతరాత్రిమున నీ కోయిల యెక్కడిదా యనుకొంటిమి.

తిష్యరక్షిత

మీ హృదయమున దీని కింత వైశాల్యమును ప్రసాదించి, ఈ కోయిల నందు సర్వకాలములకు బంధించివేసి కొనుడు.

గాయకి యయిన నేమి ? పికమ్మ కూడ
మాధవ ప్రీతిగా కాదె మనుచునుండు
మాగధేశ్వర—మధు పుష్ప సాగమనము
దలచి బ్రతుకునకున్ వసంతమును దొడిగి ·

అశోకుడు

నీ తండ్రికి మేము రక్తపిపాసులం, సామ్రాజ్యవాదులం. మాతో సంబంధమా ?

తిష్యరక్షిత

ఆ తండ్రి గతించియే పోయినాడు. నా మతమున దయ, సహనము దుర్బల గుణములు. అసమర్థుల ఆయుధములు ... నా బ్రతుకు బాటను పూలు జల్లుడు.

ఘోరతేజఃఖండము నందు కొఱుకగారాని కొయ్య కళింగ మీరాజ్యమందు జేర్చి,
తూర్పు భారత ద్వారతోరణ రక్షగా తోసలీయుల నిల్పుచేసియుంతు,
దండ నుండి ప్రపంచ దండయాత్రను కూడ కలయునిబ్బరమీయగలుగుదాన,
ప్రేమించి, దాన మెప్పించి, మీ జీవితాంతరముల తరగల గరుగుదాన,
అడుగు అడుగుకు మీత్రోవ యందు గల్గు కంటకము లేరి, పైటసగమ్ము పఱచి
సైన్యకతియ ? మంత్రియ ? చెలి, సతియ ? అనగ భారతోద్ధార కర్మలో
బాలు గొందు.

అశోకుడు (తనలో)

నా యౌవన కాలపు స్వప్నసుందరిని దర్శించుచున్నాను.

తిష్యరక్షిత

సామ్రాజ్యలక్ష్మివలెనే నన్నును మీ పాదాక్రాంత మొనర్చినది మీ శూరహృదయ సౌందర్యమే.

అశోకుడు

ఈ హృదయమున కొక తిష్య అవసరమే.
పదతి రొండబాటుకు శాంతివిడిన యెడదద దిగ్విజయ లాలితమ్మయ్యె తెరలేదు
సంధిమిత్ర కడమయి తిష్యను వరించ తేనెకుని వీడి, అమృతాబ్ధిదేల దోచు

తిష్యరక్షిత

ఉద్ధృతను. స్వామీ, మీ గుణమాల నాకు నిత్యగానము. మీ నామమాల నాకు జీవనజపము. కేవలము మీ పాదముల యెడ పూజాప్రసూనముగా దలచి జీవించుచుంటిని.
మీ జయకిరీటపున్ గాంతి మృదుల రేఖలొక్కటొక్కటి నాకునొక్కొక్క గర్వ
రేఖ కాగ, నీ ప్రతుకె అశోక నాథుమౌళికి స్తోత్రమోయన మనుచునుంటి
(దండ వేయును)

అశోకుడు

సంధిమిత్రాదుల ప్రకృతులనలెకాక ఇందొక ప్రత్యేక వైలక్షణ్య మున్నది. నీ స్పర్శలో నా హృదయము నకు బలమున్నది. రమ్ము. ప్రేయసీ, రాణి నగుము.

(దండ ఆమె చేతులకు వేసి తన చేతులతో వానిని గ్రుచ్చి పట్టుకొనును)

తిష్యరక్షిత

లోక బాంధవుని నిర్మల్యమణముతో లోపము కనపడదే।
... ... రాజోదయ మదిగో

అశోకుడు

పున్నమ కాదా ? వెన్నెల రాజు ! రాకారేఖ లవిగో
... ... స్మితమయూఖసరులూ

తిష్యరక్షిత

ఆహా! లోకము సర్వము అమృత స్నానము !
... .... ఒడలు పులకవీను

అశోకుడు

అవని స్వర్గమేను

(తెరలో గానము)

ప్రేమ కంటెకలదా లోకము
మోహితమై పోదా విజయము
కత్తి యొత్తిగిలదా క్షేమకు
స్థానమిచ్చి చనదా అంతయు
శాశ్వతము కాదా ? ॥ప్రేమ॥ శాద్ధ భిక్ష కాదా ?॥ప్రేమ॥

(ఉపగుప్తుడు ఇటునుండి అటు పోవుచుండును.)

అశోకుడు (పట్టుకొని తెచ్చి)

నీవు నా పెండ్లికి (వికటహాసముతో) తోడు పెండ్లి కొడుకవై ఆనందింతువు గదమ్మా

ఉపగుప్తుడు (భయముతో)

చక్రవర్తీ!

అశోకుడు

సరి కాని, పక్షులు సహితము ఇట్లు జంటలు కట్టుచుండ మీ సన్యాసులు ?

ఉపగుప్తుడు

అది సరి కాని, నీకు మాత్రము ఈ వినోద మింకను ఒక్క నెలమాత్రమే. వినోదించుము. పై నెలలో నీవు దేవతలలో కలిసిపోదువు నీ మురికి జీవితము మూతపడి ద్వితీయ జన్మ రానున్నది. (మూసుకొని ప్రస్థానము.)

అశోకుడు (ఉలికిపడి)

ఆ! నిజమా? (వెంటబడబోవును)

తిష్యరక్షిత (ఆపి)

ప్రియా, నన్ను వదలకుము. కాలాశోకునితో, నీ జన్మమున నెలజీవితమే చాలు నితరమగు శతాయువుకంటె.

నెలగినమ్మల యేక పూర్ణిమకు నైన, బ్రతుకుపాడవు బహుళదివప్రాప్తికైన తట్టుకో గల్గునను గుండెధైర్యమొదవు! తిష్య బ్రతుకుద్రోవల వెల్గు దీర్చితింత

అశోకుడు

సరి సరి. ఆగుమా సన్యాసివాడు సత్యజ్యోతిషమే, చెప్పెనో అసత్యముచే బెదిరించెనో ? అతనిని పట్టి, నరక గృహమున ద్రోయించిన ?

తిష్య (నవ్వి)

కపట సన్యాసియేయైన ఇప్పటికి కప్పుడే దాటి యుండును.

అశోకుడు

నాటి పరశురాముని క్షత్రియయజ్ఞము; జనమేజయుని సర్పయాగమువలె, నేను పరివ్రాజకయాగ మొనర్చి, అశ్వత్థామ నిష్పాండవ కృతివలె భారతము నిర్బౌద్ధము గావింతును.

(ప్రస్థానము)

తిష్యరక్షిత

ఆ ప్రవీణ ఖడ్గము ద్రుంచి అప్పుడిట్లు నా పని సగము తగ్గించినావు మహాని ఇట్టు లిప్డు కొంపకే అగ్గి పెట్టుకొనియే ఇందు నా పాలు ఫలమేమో ఎంచ వలెనో?

తెర

---

## షష్ఠమ రంగము

★

(కళింగమున అశోకుని ఆరామ మందిరము—అశోకుడు శయ్యాగతుడై ప్రవేశము)

అశోకుడు

... ... ... ... ...

చారుడు

ప్రభూ, (అభివాదముచేసి) మొన్నటి బౌద్ధపరివ్రాజకుడా యున్న తైలమునుండి తలపూవాడక తేలును నెగిరిపోయినాడు.

అశోకుడు

(తనలో) యోగశక్తి! అతడొక మహాత్ముడైయుండును... ... నెల దినముల బ్రతుకునను నాకీ అహంకార వినోదములా? .. (ప్రకాశముగా) ఆ మహాత్ముని జూడవలెను. జాడతీయుము.

(చారుడు అభివాదము చేసి ప్రస్థానము)

ఉపగుప్తుడు (తెరలో)

కరుణ మతమ్మును బఱపెదము గౌతమ గీతల గఱపెదము
దమ్మపదమ్మును తెలిపెదము మోహాన్త్రమును బూన్చెదము

అశోకుడు

ఏమా గానామృతము! ప్రాణములు పోసికొనుచున్నవి. ఆ వాణియే!

ఉపగుప్తుడు (తెరలో)

అలః సుందర చంద్రగుప్తులకు అందనిఫలముల నందెదము
బౌద్ధపతాకల నెత్తెదము విశ్వము నేకము చేసెదము

అశోకుడు

సార్థముగు నీ గీతి నా హృదయమెరిగి రచించినట్లున్నది. ఆనాడును ఇదే పాట. నాటి యుద్ధావసానకాలమున కళింగమున తళుక్కున మెఱుపువలె నగపడుట, నాకంఠమున కెత్తిన కత్తి నుత్తరించుట, దేనికో మఱల కలిసెద ననుట, అంతయు నొక్క త్రుటిలో జరిగిపోయినది. ... అదే స్వరము ... అదే పాట! ఆపాట అప్పుడు నా కర్థము కాలేదు. నిర్భాగ్యుడనై తెలిసికొనలేదు. కాని, ఇతడే తిరిగి ఆ అహో

రాత్రముల సంధిసమయమున నాకు భవిష్యము చెప్పినది... (తన్ను చూచుకొని) చండనిరంకుశుడగు మాగధుని మరణావతార మెంత హాస్యాస్పదముగ నున్నది! ... రోజులు లెక్కిడుకొనువాని కభిమాన మేల?

ఉపగుప్తుడు

(ప్రవేశము)

అశోకుడు

పరివేషసూర్యుడగు నిత డెవరో మహాత్మునివలె నున్నాడు. (లేవబోయి, బలహీనతతో నమస్కరించి) స్థితి చూడ, కాలముతీరునట్లే తోచుచున్నది.

ఉపగుప్తుడు

తీరిపోవును. దివ్యుడ వగుదువు. ఇంక నేడు గడియలే. (చేయినెత్తి) ఆఁ ఆఁ, కూర్చుండుము.

అశోకుడు

(సప్రయత్నముగా లేచి) క్షమించుడు. ఇన్ని యేడులు నేనేమేమి చేసెడివాడనో తెలియకయే. ఈ యేడుగడియలైన పాపభూయిష్ఠమగు నా పూర్వజీవితమును క్షాళన మొనర్చుకొను విధమున జీవించుటకు తెలుపుడు. ఉద్ధరించుడు.

ఉపగుప్తుడు

మాసములో మరణము కలుగునన్ననే యింత వైరాగ్యము ప్రబలినదే. ఏ క్షణమును మృత్యుసన్నిధిగనే యెంచుకొను మాసన్యాసుల కానందోత్సవాభిలాష మెట్లు కలుగును?

అశోకుడు

క్షమించుడు. గురువరా, కర్తవ్య ముపదేశింపుడు. నగము మరణించునప్పటికైన పరివర్తుడ నగుదునేమొ!

ఉపగుప్తుడు (చిరునవ్వుతో)

మనుష్యులకును కంటకుడ ననిపించుకొను నీవు దేవతలకును పూజ్యుడవు కాగోరుచుంటివా?

అశోకుడు

ఆ. స్వామీ, మిక్కిలిగా కోరుచున్నాను. ఈయేడు గడియలకును తత్పూర్వ జీవితమునకును సంబంధము త్రెంచు రేఖను మధ్యగా కత్తితో గీయనెంచుచున్నాను.

ఉపగుప్తుడు

పశ్చాత్తాపము హెచ్చుగా కలుగుచున్నదా?

అశోకుడు

కలుగుచున్నది. స్వామీ, ఆ మంటనాలుకలు నా కల్మషము నంతను నాకివేయుచున్నవి.

ఉపగుప్తుడు

ఆ చిచ్చు నిన్ను కాల్చివేయుట లేదా?

అశోకుడు

కాల్చివేయుటే కాదు బూడిద చేయుచున్నది. అందుండి ఏడుగడియ లాయువు కలిగిన నవాశోకు డుద్భవించుచున్నాడు.

ఉపగుప్తుడు

కుమారా, ఉద్భవించుట కేడుగడియలు పట్టును. కా

లాశోకత్వమను కోశమునుండి దేవతాప్రియుడగు ధర్మాశోకుడు చీల్చుకొని, ఉద్భవించును.

అశోకుడు (సాష్టాంగపడి)

మౌర్యచక్రవర్తుల కిలువేల్పులగు కౌటిల్యుని, అగ్నాత యశస్వుని అపరావతారులరు, అర్థము చేసికొనుచున్నాను.

ఉపగుప్తుడు

తథాగతుని ఇచ్ఛ. బుద్ధం శరణం గచ్ఛామి! ధర్మం శరణం గచ్ఛామి! అశోకవర్ధనా, నా అనుశాసనమున నీజీవిత మెట్లుండగలదో కనులుమూసికొని, దర్శించగల మేథోచిత్రముదు వర్ణించుము.

అశోకుడు (అర్ధనిమీలితుడై)

మీలో సంకల్పమాత్రకృతైక సామ్రాజ్య సర్వసర్వం సహాత్వమును గాంచుచున్నాను. మీ మంత్రమోహన బౌద్ధ గీతా వాతావరణ సృష్టిలో ధర్మా సింధుకోశ పరివర్తియు, గాంధార కన్యాకుమార్యుపవిష్టితయు నగు సమస్తభారతము నొక సింహాసనముగను, తథాగతు లందుపై అశోకవర్ధను నభిషేకించుచుండ పీతపతాక పటమును ఛత్రముగాబట్టి, మీరు త్రింశత్కోటి భారతసంతానమునకు నభయమొసగుటను దర్శించుచున్నాను

ఉపగుప్తుడు

శుభమగుగాక! కుమారా, నీవు కాంచునదే నీ భవిష్య జ్జీవనచిత్రము.

అశోకుడు

గురుగ్రామణీ, కరుణించి, భక్తు 'నుపాసకు' గాఁగొని, కర్తవ్య ముపదేశించుడు. సరిగా నాహృదయపాత్రిణ తంతువునే తాకి, మీటి, మోగ్రయించితిరి. జోహారులు మీకు. ప్రేమామృతదీక్ష నొసగి శిష్యునిగా బరిగ్రహింపుడు.

ఉపగుప్తుడు

ప్రియదర్శీ, నీవాంఛ తీరుగాక! దాన భారతి రాజన్వతి కాఁగలదు. కాలాశోక నామమింక నీకుతగదు. లోకప్రియమునకు దర్శకుడవై ప్రియదర్శి నామమున రంజిలుము.

అశోకుడు

దివ్యోత్తమా, ఆజ్ఞాపింపుడు. ప్రియదర్శి శిరము మోడ్చి, నిలిచినాడు.

ఉపగుప్తుడు

జగత్కల్యాణుడు పూర్ణరూప మొసగుకొన లేకున్నను సాక్షాత్కరించుకొన్న విశ్వ స్వప్నమునకు రూప మొసగవలెను.

ధార్మిక తుఫామంత్ర నిస్తబ్ధమగుచు 'ద్వేష' సర్ప మేగ, స్పర్శవేదితాకు పొందిన ట్లోకలోకరు బంధుగులుగ నెసగు సంఘమునకు దైవమేదలో ఇతో?

సంఘం శరణం గచ్ఛామి!

అశోకుడు

మహాత్మా! ఈ పాపికి, నీచజన్మునికి, బంధువాంత

కునికి, విషయలంపటునికి, సంతత మృగయావినోదికి, బౌద్ధ మతము నంతావు దొఱకునా ?

ఉపగుప్తుడు

అంగుళను బుద్ధులు కాలేరు. కాని, పితృహంతకుడగు నజాతశత్రుడు, సంతత హింసాత్మక యాగలోలుడగు బింబిసారుడు, పాంధజన హత్యావ్యాపారమున రక్తాన్నము గుడుచు అంగుళిమాలుడు, నీచజన్ములగు కంబళ గోసలులు, తుదకు తథాగత భ్రాతకే ద్రోహియైన దేవదత్తుడుకూడ బౌద్ధస్వర్గమునకు వెలికాకపోగా, నీవా ప్రియదర్శీ, పశ్చాత్తాప సంతప్తుడవై ద్వితీయజన్మ నొందియున్నావు. కళింగ యుద్ధరూపమున తథాగతుడు నీకు ప్రత్యక్షమై దీక్ష నొసగుచున్నాడు. చాణక్యసృష్టియగు నీ విశాలసామ్రాజ్యము నేకరాజకముగా బౌద్ధచ్ఛత్రముక్రింద పాలించుచు జయస్తంభములు కాక ధర్మస్తంభములు నిలుపుము.

అశోకుడు

మీ శ్రీముఖమునుండి నిర్ముక్తమయిన కళింగక్షేత్ర వాణి బోధిసత్వగీతయని తెలిసికొనుచున్నాను. కాని చండసత్వప్రధాన మగు నా ప్రకృతి తిరిగి ప్రాతగాడిలోనికే తార్చునేమో !

ఉపగుప్తుడు

భగవదిచ్ఛ యది కాదు. నీవు పూర్వ జన్మమున కాశ్యపబుద్ధునకు పరిహాసమునకై మృద్భిక్షము బెట్టి—నిమ్న

మార్గముల బట్టిన నీ శక్తిమహస్సును దేశోపయోగమునకు నే సంకల్పించిన ఆయున అశీస్సును బురస్కరించుకొని— ఈజన్మమున జంబూద్వీపాధిపత్యము సంపాదించితివి. నేను నిమిత్తమాత్రుడను. నీవు రక్షకుడవు. లోకములు నీ ద్వార ము[illegible]బొందవలెను. నీలోని దుష్టసత్త్వము త్రుప్ప పట్టి, యత్పూర్వకర్మలవిస్మృతిని ముంచివేయగల యంతగా నీయశస్సు పండగలదు. అశోకరాజ భిక్షువును సంపాదించు కొన్న బౌద్ధభారతము ధన్యము.

అశోకుడు

గురువుల ఆశీర్బలము. సింహాసనస్థితుడగు 'అర్హాతు' డనిపించి చరిత్రనిర్మాణము గావించుకొందును. (తనలో) మహాత్ముడగు పింగళవత్సజీవుని వాణి నేటికి నిజమైనది.

ఉపగుప్తుడు

ఎందరశోకుల యుద్ధభూములను । విశ్వదేశములు కొలుపోయెనో
ప్రేమబంధమున జొట్టెదము । భూమి స్వర్గముగ మార్చెదము

(ప్రస్థానము)

(తెర)

# ద్వితీయాంకము



## ప్రథమ రంగము

★

(పాటలీపుత్రపు వీధి తెరముందుకు వచ్చి)

నాథు

విజాతి రాజులు అరాతిఘోజులు । స్వదేశ తలముల నోరసెడిరా!

ఆ ........॥విజాతి॥

'అమిత్రఘాతుక' మహోగ్ర రేఖలు అశోకమూర్తిని మణగెనురా ॥విజా॥

బగవత్ప్రేరిత భారతప్రభుడీ మాగధుడే మన ప్రభుడగురా !

తేరా ..........కసరా... ......భారతపుత్ర ! ..........  ॥విజాతి॥

(ప్రస్థానము)

---

## ద్వితీయ రంగము



(ఆ తెర లేచును. పాటలీపుత్రమున సుజ్ఞాకవీధి తెరముందుకు వచ్చి)

ఉపగుప్తుడు

దేవలోకమొ, మానవలోకమొ, భేదము కనబడనీ వెలుగులు నిరిసెనవి

దేవతాప్రియుని, దేవతాగుణుని, మాగధోత్తముని నుహిసుల మునుగ॥దేవలో॥

(ప్రస్థానము)

---

# తృతీయ రంగము

(పాటలీపుత్ర పురోపకంఠవనము, తెర లేవగా)

నేపథ్యగానము

భువికి దివికి నిచ్చెన నిలిపి, స్థావరము లాతిథ్య మొసగు ॥భువి॥
జీవరసములు చేర్చి ఫలముల నతిథులకునై విడచు తరువులు
హృదయరసములు చేర్చి యంజలి నతిథులకునై చాచు సుమములు ॥భువి॥

హేమ, కుణాలుడు (ప్రవేశము)

కుణాలుడు:- చూడుము హేమ,
ఎంచి, తీయతేనెల విదిల్చెడి ఈ మాళి ప్రేమపద, ఆత్మసతికానికెట్టి, ఉన్న వానితో తృప్తిగొననెంచుతాన్న, వధుపమూర్తి ఎంతటి ప్రేమైకమూర్తి యౌనో!

హేమమాల:- ఇటు చూడుము
పూలపొట్టలలో దూండి ప్రోవుచేసి, తేనెపట్టలు పెట్టను తేనెటీగ పేర్చుచుండు లోకమునకు పెట్టుటకొ ఆకొ? ఎంత విశ్వగతప్రాణి! ఎంత ప్రేమి!

కుణాళుడు

మూలము మించిన అనుకరణము హేమ, నీయెడ నా హృదయము ముగ్ధము కాకయుండదు. నీయెద నాయెద నందుకొన్నది. నీ జీవితస్నేహమున నా జీవితము భాగ్యవంత మైనది.

హేమమాల

నిత్యమోహకమగు మీహృదయ సౌందర్యము నాకు చిరజీవి యని నమ్ముచున్నాను. మీరు నాకు దక్కుటలోనే

నాయదృష్టమున్నది. మీయట్టి యైశ్వర్యము బహుమానము నకు నేననర్హురాల నేమో అనిపించుచుంటను.

కుణాలుడు

ప్రతిహత మగుగాక! నీమాటలలో నశ్లీలములు దొఱలుచున్నవి!

హేమమాల

కామస్వామీ, నాహృదయము సుందరము కాకపోవచ్చును. అగుచో మునుపే మిమ్ము నాస్వాత్యము చేసికొనను. కాని విధికృతములగు నాంగిక లోపము లేవైన కలిగిన?

కుణాలుడు

నాకు కలిగిన?... ప్రాణమోహానము మన ప్రేమ హేమా. తుచ్ఛభౌతికము, సంకుచితము కాజాలదు.

హేమమాల

మీరు ప్రేమించుకొలది, ఇంకను అర్హననిపించుకొన నెంచి, జీవితము చేతనుంచుకొని మీ పాదములచెంత నిలిచియుందును. మన అలోకప్రేమయే మనల నమంగళముల నుండి కడిగివేయుచుండును.

కుణాలుడు, హేమమాల

మానవత్వమున మకుటమెత్తెదము వత్తువా నాతో? ...రారోయీ ॥మాన॥

కుణాలుడు

త్యాగము నెంతో మోహించెది, తరుణము కొఱకై తపియించి
సేవాన్వేషణ చేసెదా?

హేమమాల

దినదిన మూర్తమజీవులను సృష్టిచేయు భగవంతునికి చేతోడై మన ముందామా?

కుణాళుడు, హేమమాల

దీనజన్మలకు తేజమునొసగి, దివికై భువి నెత్తేమా?
దేవతలను తలతన్నేమా?... ॥మాన॥

(నడచుట నభినయింతురు)

(ఆ తెర లేచును. విపణివీధి, అంధభిక్షువు కూర్చుండి ప్రవేశము)

అంధభిక్షుకుడు

పందలో పిందలో బంగారమును వెదికి, తిందురె నాగోడు వినందురయ్యా
భాగ్యదేవతప్రియులు మీకేవిలోటు నిర్భాగ్యుణ్ణి రక్షించరయ్యా

[అశోకుడు మారువేషమున ప్రవేశము. కుణాళుడు, హేమమాల సైగలతో అభివాదము చేయుదురు. అశోకుడు స్వీకరించును.]

అశోకుడు (తెరలోనికి చూచి)

మొన్న యవనరాయబారి డెయిమేకస్ ఈవిధముగా రత్నములు రాసులుపోసి ఏదేశమునను అమ్మటు, కొనుట ఉండదన్నాడు.

హేమమాల

రాసులు! ప్రక్కనే ఆకటి కెండి, శోషపోయియు జాలి కల్గించలేని క్షుద్ర, ఆర్త భిక్షువు!

కుణాళుడు

ఇవి వర్తకమునకు పోసిన వగుటచే వీరివి కావు. ఒక్క క్షణములో చెదిరి, తరిగిపోవును. తక్షశిల, శ్రావస్తి, కాశి,

రాజగృహా, వైశాలి, కౌశాంబులలో ప్రఖ్యాతులైన ద్వాదశధనస్వాములున్నారే వారివి అసలు రాసులనగా రాసులు. అవి చెదరవు సరికదా, పెరుగుటయే పని.

భిక్షుకుడు

ధర్మమ్ము తీసిన పానచంద్రముగాను కడుపు చల్లగ బ్రతికి కరుణించవయ్యా
కలవారికన్నులు, కాళ్లు, కడుమెత్తనగు గుండె! కుంటికి గ్రుడ్డికి కూడేసి
పాండయ్య

మీరిచ్చు పణములే మాకు నిష్కములై కలవు కాచిన అన్న స్వర్గానికి మెట్లు కడ్తాయి బాబూ. దేవతాప్రియులు. మీకీర్తి హేమా కుణాలుర జంటకీర్తుల వలెనే ఆర్తుల హృదయాల్లో ప్రాకాలి స్వామీ.

కుణాలుడు (హేమవంక చూచి)

చూచితిరా? కంటగా చూచుచున్నాము. ఒక్కరొక్క పణ మిచ్చిన పుణ్యమున పోలేదు.

హేమమాల (కుణాలుని వంక చూచి)

మనమును చూచి, ఊరుకోనవలసినదేనా స్వామీ?

అశోకుడు

(ఉంగరము తీయబోవును.)

కుణాలుడు (వారించి)

మీరిప్పుడు మారువేషమున నున్నారు.

భిక్షుకుడు

పరమాన్నము తిను ప్రభువులు దీనులను కరుణించరా?
అనాధపశువులను ప్రభువులు చూచి చూడక పోదురా! (శూన్యదృక్కులతో
చూచుచు వెళ్ళి పోతున్నారా?

హేమమాల

నాయనా, శరణాలయమునకు వెళ్ళక పోతివా? అంతటి మహారాజును సమ కాలినడి వే! దానప్రక్క నీ యవస్థ యేమి?

భిక్షుకుడు

వారి శరణాలయాలలో నాకు చోటుంటుందా తల్లీ అందరుండగానూ?

అశోకుడు

అంటే? అవి పట్టినంత మంది ఉన్నారా నీకన్న దీనులు?

భిక్షుకుడు

అదికాదు తండ్రీ. అధికారి బాబులు తిన్నంత తినగా మిగిలితే, ఆ బాబులికే కావలసిన వారుంటారు చూడండీ, ఈపనీ, ఆపనీ చేసిపెడుతూ, వాళ్ళందరినీ అనాధలక్రింద తెలుపుడు చేయించి నింపేశారు శరణాలయాలు. ఆ మారాజు కాకపోయినా ఏ మీవంటి వారయినా చిత్తగించండి తెలుస్తుంది.

అశోకుడు (కుణాలునితో)

ఏమీ, ఏపనినైనను చేసికోగలవారేనా నా రాజ్య

మున అనాథలు? నా ధర్మమున కీ భూమియే చాలదని తలచితినే!

భిక్షుకుడు

ఇంక పోండి బాబయ్యా. అమ్మో వలసినోళ్లి మీతో [illegible]ాచకార్యాలాడుతూ కూర్చుంటే కడుపెలా నిండుతుంది కనక! వేముగా నెచ్చుకోగలగాలికాని, ఎంత రాజయినా ఎందఱకు పెట్టగలడు?

భగవంతుడికి దయలేనిచో, మానవునికినీ లేదా?

అశోకుడు

దేవుడున్నాడందువా? ప్రియదర్శి శరణాలయము లుంచిన నవి ఉచితరీతి నుపయోగపడ నిచ్చుటలేదే!

కుణాలుడు

నిక్కపు దైవపూజకులు నిర్భరగా! భగవంతుడేల? ఈ
చక్కని మానవత్వ శుభసత్వము మాత్రము కల్గెనందురా?
పెక్కురు 'ధర్మమాత్ర' 'ప్రతివేదకు' లేర్పడిరే? నశించిరా?
ఎక్కెరె ధర్మపీఠముల నెక్కటి రక్కసులున్ పిశాచులున్?

అశోకుడు

ధర్మార్థము వేరుచేసిన ధనము నధికారుల పరముచేసి చేతులు కడుగుకొను చున్నానేకాని, పై పరిశీలన లేదు. నాకడు పుడికిపోవుచున్నది. లోపము దిద్దుకొందును.

(ప్రస్థానము)

హేమమాల, కుణాలుడు: (మూకాభినయము చేయుదురు)

నిన్న కోటలో సంతర్పణ జరిగినదట. వెళ్లకపోతివా! కఱవు తీఱిపోయెడిది.

మాధు : (ప్రవేశించి, తండ్రిని లేపుచు)

వారెవరో పరాన్నభుక్కులు. మన రక్తము వేరు, మన వాంఛలు వేరు. వారితో నేమిటి? ....ఎన్నితడవలు చెప్పాను? రా. నీవు తిన్నాకనే నేనుతింటాను. (వణకుతో) తండ్రి ముష్టికూటికిపాల్పడాడన్నమాట మాధు భరించలేడు.

భిక్షుకుడు (కౌగిలించుకొని)

నాకుమాత్రం మానాభిమానాలు లేకనా? (నడచుచు) కాదు. నీవుపడే కష్టాలు కళ్ళార చూడలేక. ఇదిగో (ఖాళీ జోలె విదిల్చి) ఇదిగో మానవుల్లోని మానవత్వం. పద. అభిమానం చంపుకొని బ్రతుకుటకంటె, అభిమానంతో మరణింతములే.

కుణాలుడు (చూపుచు)

ఇవిగో. ఈ చేతిమూటలు కుక్కుటారామమువఱకు తెచ్చిపెట్టగలరా?

హేమమాల

చేతికొక సువర్ణము నిత్తుము.

మాధు

నమస్కారంబాబు. మీవంటి అతిదయాపరుల ఈ ధర్మబుద్ధి ఫలితాలే యీ భిక్షుక కుటుంబాలన్నీ! మీగతుల కోసం మాకీ అవగతి!

భిక్షుకుడు

మీ రెవరో హృదయం ఉన్న అధికారుల్లా అగు పిస్తారు. మీ వెంట వస్తాం. పని చెప్పి, సక్రమమైన కూలి యిప్పించండి.

సోమమాల

రాజప్రాసాదమునకు ప్రాకారములు కట్టుచున్నారు. పని యిప్పించెదము. వత్తురా?

భిక్షుకుడు, మాఘు

కృతజ్ఞులము.

సోమమాల

ఇంటికేగి, త్వరలో వచ్చెదరా. ఉపకరణములు తీసికొనిః

మాఘు

.... మా కిల్లా? ... లేదు. (భుజము చూపుచు) ఇదిగో. ఇదే మాయిల్లు. (చూపుచు) ఇవిగో కాళ్లు, చేతులు! ఇవే మా పనిముట్లు!

భిక్షుకుడు

తమరు దయచేస్తూ ఉండండి. వెనకే వస్తాము.

కుణాలుడు (నవ్వుచుచు)

అట్లుకాదు. మీతో నడచుట మాకు ఆనందము. అలవాటు.

భిక్షుకుడు

అట్లయితే, ఆమాట లిలా యిప్పించండి బాబయ్యా! మోటుమనుష్యులం, మాకేమిటి? అధికార్ల అనుగ్రహం ఉంటే అదే చాలు.

హేమమాల

ప్రతిఫలం తీసికొని, ...

భిక్షుకుడు

చెల్లక పణం యీవచ్చును లెండి బాబయ్యా.

మాధు

ఎందరో అయోగ్యులకి మా శిరములు వంగాయి. చుట్టు త్రిప్పుకొనుటే, మండలేశ్వరులు మొదలు విషయపతులవఱకు, అందఱు. సహించలేనంతవఱకు అభిమానం చంపుకుని తిరిగాము. రోజంత కష్టించినా రోజు వెళ్ళదు... ప్రభుత్వంమీద పైనుండి క్రిందివఱకు అసహ్యం కలుగుచున్నది. సత్త్రములట! ధర్మములట! భరణములట! స్వసంపాదన కానిది మాకిముడదు. వద్దు. గొంతు దిగనైనాదిగదు.

కుణాలుడు

చెప్పుడు. మీకేమి కావలెను?

మాధు

భిక్షుకపోషకుడు రాజు. స్వబమానవులు తక్కిన స్వాములు. దిక్కులేని నిరుద్యోగులం! అవకాశము లభిం

చేనా, అశోకరాజ్యమునకు సహామంత్రిత్వం చేయగలం. పైననెట్లున్నను ప్రజాకంఠం మోగించేవారం. ఆగర్భ శ్రీమంతులు దరిద్రనారాయణుల ఆర్తి నెరగడం ఖేచరాలు జలచరాలకి సాన్నిధ్యం వహించడమే!

కుణాలుడు

ప్రభునిచే తనపాలన నెడ ప్రజాభిప్రాయము నెఱిగి మనవిచేయుటకే మేము నియోజితులము. మీకొఱకనేక పనులు కల్పింపబడుచున్నవి.

మాధు (నమస్కరించి)

మహారాజు మహనీయుడు.

భిక్షుకుడు

ఇంత స్నేహపాత్రత కలవాటుపడని ఈ జన్మల కమృత సేచన గావిస్తున్న మహనీయుల నెఱుఁగగోరుచున్నాము.

హేమమాల (నవ్వుచు)

రాజసేనకులము.

కుణాలుడు

నేడు కడు సుదినము. పాటలీపుత్రపు పాటకులు మీ స్నేహమున ధన్యులు.

ప్రాణుల దాస సత్వ ప్రతిపాదకులైన పరాన్న భోక్తృతా మానసు లారిపోయిన సుమా మన భారతదేశ సంగ్రహా మ్నాయును పూర్ణరూప మున నొప్పు. స్వతంత్రము నింకనేమి కో ల్పోనిది మాతృభూమి మిము బోలిన బిడ్డల గాంచనేగదా!

హేమమాల

ప్రజల ఆదర్శములు, అభిలాషలు తెలిసిన యువరాజే కూడ తమపాలన వచ్చినప్పుడీధర్మసంస్థల నిక్లేసాగించునా?

కుణాలుడు

అంతవఱకునా? అవకాశ మున్నచో, రేపే ఈ ధర్మాగారములను కర్మాగారములు గావించగ్గలడు.

మాధు

యువరాజుకు నియంతృత్వము నిస్తే కాని భారతం బాగుపడదు.

కుణాలుడు

యువరాజుకా నియంతృత్వం? లేక రాణికా?

మాధు

భిక్షుకాంబరములను వేనిని వెనుక కొన్నడు వెళ్లనీవని
పేరు బడసిన గడప లిక్లే వెలుగుచుండెడివా?
నేటి ఆత్మాధార సక్తుల దేశమానవ వ్యక్తి గౌరవ
తస్కరోద్ధత గుణవిరక్తుల తళుకు లుండేవా?

---

## చతుర్థంగము



(పాటలీ పుత్రము, అశోకారామము ముంగిట అశోకవృక్షము. దాని మొదట నిత్యమల్లెమొక్క. ముందొక భటుడు వెళ్లును. వెంటనే పోవుచున్న అశోకుని ఉత్తరీయము కొనగోళ్లతో పట్టుకొని అపుడు ప్రవేశము)

తిష్యరక్షిత

ఇంత ప్రొద్దు గ్రుంకి ప్రయాణ మెచ్చటికో... తిష్యాప్రేయసి తెలిసికొనవచ్చునా?

అశోకుడు

ఆచార్యాదు లెదురుచూచుచుందురు. బుద్ధప్రతిపద్యుత్సవములు రేపటినుండియే కదా?

తిష్యరక్షిత

పోనిండు. రాణికిని, పరిచారికినిగల యంతరముకూడ తారుమారు చేయుచున్నారు.

అశోకుడు

ప్రేయసీ, నీకు తెలియకనా అడుగుచున్నావు? అశోకుడే యిప్పుడు శాసకుడుగా కాక, కేవలము బుద్ధభక్తుడుగా, బోధియాత్రికుడుగా అరుగుచున్నాడు.

తిష్యరక్షిత

అనుకొన్నంత మాత్రమున అశోకవర్ధన ప్రియదర్శిలో

శాసకత్వమును తరుగదు, తిష్యాదేవిలో శాసక శాసకత్వము ను తొలగదు.

అశోకుడు

కర్తవ్యవేదులగువారికి బౌద్ధతేజముముందు ప్రియశాసకత్వములు, లోకశాసకత్వములు అన్నియు నతపింఛములే.

తిష్యరక్షిత

పోనిండొక్కగడియయైన... ఆగ గలరా?

అశోకుడు

సేవకా, ఆచార్యుల నొక్కగడియ ఆగవలసినదిగా కోరుము. ఊఁ! తేల్చిపంపుము.

తిష్యరక్షిత (ఉద్విగ్నయై)

జీవిత నిక్షిప్తమగు రసమునంతను అంకితమొనరించుకొన్న వ్యక్తికినీ ఒక్కగడియ కర్ధమొక్క గడియయేనా స్వామీ?

అశోకుడు

కానీ, సేవకా, వారిని వెళ్ళుచుండుమనుము. వెనుక నుండి కలిసికొందును.

(తెరలో)

చిత్రము

తిష్యరక్షిత

మీయావనచంద్రుని శుక్లపక్షమును దేవి కర్పించితిరి. ఇంక పూర్ణిమాజ్యోత్స్నలను పట్టపురాణి సంధిమిత్ర కొల్లగొ

ట్టినది. ఈజీవితావిష్కరణమై, ఈఉపవేణిక మీజీవితస్రవంతిని సంగమించు నప్పటి కప్పుడే బహుళ పక్షారంభమైనది. అమావాస్య రాకముందే నాప్రాణముల కీరాహుగ్రస్తత యేమి?

అశోకుడు

రాణీ, నీకేమి తక్కువ చేసితినో అర్థముకాదు.

తిష్యరక్షిత

అర్థముకాదు, అవును. నాజీవితప్రారంభమట్టిది. నేనేఆ సంధిమిత్రనై, ఆదేవినై ఎందుకు ప్రభవించకుంటిని? నేనింత ఆలస్యముగా ఏలజన్మించితిని?

అశోకుడు

విధికూడ సమాధాన మొసగలేని సంశయము.

తిష్యరక్షిత

నాకర్మ! పట్టపురాణికి యువరాజు కుణాలు నొసగితిరి. దేవియు వీరప్రసువైనది. గతించినవారు వీరమాతలవగా... బ్రతికియున్నదానను. నాకో? నాకును పుత్రగాత్ర పరిష్వంగ సుఖమొసగుడు!

అశోకుడు

అదియారాణి, వారందఱును కుమారాశోకునికీ, కాలాశోకునికినీ రాణులన్న పేర్లేపొందిరి. నీవు ప్రియదర్శి నృపాలుని పరిణత హృదయమునకు సమీపస్థవై, పూర్వప్రతీచీదిక్కుల దాకి, వెలుగు ధార్మిక సామ్రాజ్య తారకమునకు ధ్రువతార

ఆగను. రాజులోకమున కగ్రగామి కావలెను. అట్టిచో, రాణి విచారించరాదు. స్వీయసుఖములకై మోహము వలయరాదు. రాచఠంట త్యాగమునుండి లోకహితోన్మీలకమగు నమృతము పుట్టుకొని వచ్చును.

(అశోకుడ ప్రస్థానము. తిష్యరక్షిత కవాటములో నిరీక్షతో నిలుచును, తెర.

(తిరిగి తెరలేచును. పాటలఅదేదృశ్యము)

తిష్యరక్షిత (నిట్టూర్చి)

యౌవనము పోయుటెంత సులభముగా తలచినాడు నాథుడు? ఒంటరి తనము దుర్భరముకాగా నాథు డుజ్జయిని నున్నప్పుడే దేవినితోడు తీసికొన లేదు? ఇప్పటికి నేనుమాత్రమే మంత పరితపనను అప్పటి తన కంటే? రాణులు తమ యౌవన జ్వాల నణచుకొన లేక పోయినచో భస్మము కావలసినదే కాక రాజుల ఆత్మశోభన మహాయజ్ఞమున నదియే స్నిగ్ధ పదార్థము హవిస్సుగ కూడ నుపయోగపడవలసిదేనా? ఆహా! భారతీ నీసంతానమున కెట్టి పతివ్రాతసౌందర్యము పట్టినదమ్మా! సముజ్జ్వలితాగ్ని గుప్పిటను, సంక్షుభితాబ్ధిపుక్కిటను నిలుచునా? యౌవనైరావతమునకు నవయౌవనాంకుశము కాని కుదురదు. మహారాజు శోభన మందిరమున నెన్ని శిలామూర్తులు లేవు? ఎన్ని దారుమూర్తులు లేవు? ఇది చైతన్యమూర్తియైపోయినది మానవమూర్తియైనది. ఈసౌందర్యశకలములో

ప్రేమను నుంచుకొని ఆరాధించుకొనను హృదయముండీ, యౌవనము కారణముగా సున్నితమైపోయి ఏ పాటి నిరాశ కైనను ప్రళయపర్వతము బ్రద్దలగు నంతటి దుర్బలమైనది! (నిట్టూర్చికూలబడును.)

ప్రణయినీ వియోగ తాపోపశమనమున కుపకరించు చంద్రికల గఱగించుకొన్న శశికాంత శిలాద్రవములను మోడు మ్రాకునకు పాదు చేసిపోసికొన్నట్లు, ప్రకట పారిజాత మధువులు పదిలపఱచి, పావకునికి దాహమిచ్చినట్లు ......ఈ ప్రణయతపస్విని హృదయరోచిస్సులను ఆ నూనె ఆరిన దీపకళిక కర్పించుకొని చావను లేని అభాగిని యైనది. (మూర్ఛపోవును.) (తెరలో)

ఎన్నాళ్లిట్లు కవాట తోరణమై వ్రేలాడి వ్రేలాడి కృశించెదవు!
క్షుత్పిపాసలు కూడ తీరునాయేమి ?

అశోకుడు (ప్రవేశించి)

(ఆమె నొడిలోని కెత్తుకొని, కమండలూదకముల గనులు తుడిచి)

ఎంతపనియైనది? ఎంతపనియైనది?

తిష్యరక్షిత (కనులువిచ్చి)

స్వామీ, దయచేసితిరా? (మఱల కన్మూసి) దాహము! (ఈయగా త్రాగి) ఈదీనురాలిపై కరుణించుచుంటిరా? (చేయి నందుకొనును)

**అశోకుడు**

బుద్ధ సప్తాహమంతయు నుపవాసమేనా?...ఏమి నీ అదృష్టము!

(తెర)

## పంచమ రంగము

(పాటలీపుత్రము; వీథిలో ఉపగుప్తుడు)

రాజును సంఘవైద్యుడగుగా.. జనుడా, రాజును సంఘవైద్యుడగుగా॥
వ్యాధినివారణమటకు లేక అది రాజు చూచుటే శక్తి కదా ॥జనుడా॥
దుష్టశిక్షణమువటకు లేక మదిదౌష్ట్యకారణమె తరుగుమురా రాజా...
రాజును సంఘవైద్యుడగుగా

---

# తృతీయాంకము

## ప్రథమ రంగము

(పాటలీపుత్రము–తిష్యారామము పైఅంతస్థున నిలబడి, క్రిందచేరిన భిక్షువులకు ముత్యములు బిచ్చముపెట్టుచు తిష్యరక్షిత; అశోకుడు ప్రక్క నిలబడి; నాథు క్రింద పాడుచు భిక్షువులమధ్య; దూరమున కుణాళుడు అనుగమించుచు—(ప్రవేశము.)

**నాథు** (సితారు మీటుచు)

ప్రేమ తెలిసిన యెడద యేమి దాగదు స్వామి
వెలుగుకై చీకటిని వెతుకవలయునె దేవ!

కరుగ నేర్చిన మంచు కరుగకుండదు స్వామి
కరుగ నేర్చిన గుండె కరుగకుండదు దేవ

కుణాలుడు (తనలో)

ఇతని పాట నన్నెంత వెంటవేసికొన్నది! ... ... ఇతని శక్తిని దేశోపయోగమునకు తేగలిగిన నెంత బాగుండును!

నాథు

అమృతానికై శశిని అడుగవలెనే దేవ?
వర్షానికై మేఘు ప్రార్థింపవలయునే?

(తనలో) వెదుకబోయిన తీగ వెంటనేపడినది.

అవిశాల హృదయాల నమరునా విశ్వాలు?
స్వార్థాత్మ కెక్కునా ప్రాపంచికపు టార్తి?

కుణాలుడు

(లోలోపల నాపాటనే పాడుచు నుండును.)

నాథు (తనలో)

అర్థము లేనిదే నెయ్యము నొనర్చించని యువరాజు సార్వభౌముని ధర్మ కార్యముల నధిక్షేపించుచున్నాడట!

దాన మెత్తిగిన చేయి దాగియుండదు బాబు
కరుణ యెత్తిగిన గుండె కదలకుండదు బాబు

అశోకుడు

(తిమ్మరక్షిత దోయిలి నుండి ముత్యములందుకొని నాథుని జోలిలో పోయును)

కుణాలుడు (తనలో)

గాయకుల సొమ్ముకదా సకలజన హృదయములును. మఱి యీ దివ్యవాణి లోకహితమునకు గాక భైక్షుకవృత్తి కై ఉపయోగపడుట!

తిష్యరక్షిత

(కుణాలుని తెప్పవాల్పి చూచును.)

నాధు

ఆకలాపిన యెడద ఆశీస్సులే కాని దేవుడైనను ఎంత దీవించగలడమ్మ!

విజయోస్తు! (అంటుకొని, జోలిముడిచి ముందడుగు వేయును.)

అశోకుడు

యువరాజు కుణాలుడేనా? ... ఇక్కడనిలబడితివేమి? లోనికి రమ్ము

తిష్యరక్షిత

ఇతడేనా ... ...యువ... రాజు?

నాధు

ఓహో! విజయోస్తు! (కుణాలునిముందు జోలెవిచ్చి మొగము చూచును)

కుణాలుడు

బిచ్చము పెట్టి మానవునిలో స్వయం జీవన శక్తుల నూడ్చివేయుడు యువరాజు! అతనిని మోహింపజేయు శక్తి నీ గానమునకు మాత్రమే. ఒకపాట చెప్పెదను. సోదరా, చెప్పుకొందువా?

నాథు

చిరంజీవ ! (సితారు మీటుచుండును.)

కుణాలుడు

కష్టజీవులరక్తకణములను పీల్చేటి సంఘకాయము పట్టినట్టి యొక చీడగా
భిక్షుకునిగా నిన్ను జతకట్టుదురా వీధిగాయకా, స్వాధారుడవు కమ్మురేరా!

నాథు (ఆపాటనే పాడుచు, ఇంకను)

పొట్టకై కాక నీపాటలను పాడరా!

(తన్మయుడై జోలె జార్చును. ముత్యములు పొదలైనవి చెదరిపోవును.)

కుణాలుడు

నీ తంత్రులకు జాతి నెత్తురు లుడుకగా

నాథు

నీచేతికదలికల హృదయాలు కదులగా, నీపాటలకు జాతి నేత్రాలు తడియగా
నీ నృత్యముల జాతి కాలిప్రేళ్లు కులుకగా, నిను వినుటకై జాతి నిలుచుదినము
లవేవి?

కుణాలుడు

స్వాభిమానము చచ్చి, స్వాధారమును విడిచి
స్వాతంత్ర్య-భూమి, నస్వాతంత్ర్య-జీవిగా

నాథు

డానిసపుర్వ్వగా, స్వకృతాపరాధిగా సంఘమున భిక్షుకుని స్థానమును
తెలియరా?

(ఇద్దరును ప్రస్థానము.)

తిష్యరక్షిత

ఇదేమి ? ఎంతనిర్లక్ష్యము !

అశోకుడు (తనలో)

ఇందు మహార్థమున్నది. మానన ప్రకృతియు, నా దానధర్మ విధాన మా ప్రకృతినెట్లు ధ్వంసము చేయుచున్నదియు నాకు తెలియుట కిదియొక విధానము. అందులకే లోకము నాకంటెను ఇతనినే యెక్కుడు పూజించును. కుమారా, నీ యొక్కొక్క సూచన ఒక్కొక్క శతవర్షానుభవముకిదా! నీవు నానాజనులలో కలిసి తిరుగు అస్తికుడవైపోతివి. కాని, వృద్ధాశోకునికే కర్తవ్యము బోధించు నిన్ను నెత్తి నుంచుకొనెడివాడను.

తెర

## ద్వితీయరంగము

(ఆ తెర ముందుకు కుణాలుడు, నాథు ప్రవేశింతురు—మహాలోకవీధి)

కుణాలుడు

నేడు కడు సుదినము మిత్రమా, నీలో నాకు రెండవ కుడిభుజము దొరికించుకొంటిని. నీప్రాప్తిని నా సేవాదీక్ష ద్విగుణమైనది. నీవంటి మోహన కవిగాయకుని కడుపు కాల్చుటలో నీశ్వరుడు లోకహితము తలచినాడు.

నాథు

చక్రవర్తి పుత్రుడయ్యు బీదరికమునే వరించిన నీ ఆదర్శ మెవరిని మోహపెట్టదు?

(తలపాగ, గడ్డము తొలిగించి, తిరిగి ధరించును.)

కుణాలుడు (నగుతో)

భక్తుని భగవత్పరివేషమువలె వెన్నంటియుండి, రాజకుటుంబమును భరతఖండమును చేతియొక కంట నుంచుకొన్న అర్హత యశస్వులరా? ధన్యులము.

నాథు (వారించి)

ఆగుము. కుమారా, నేనిప్పుడిట్లు వచ్చినది నిన్ను పొందుటకే. బౌద్ధుడగు నీతండ్రిలో గోల్పోయిన రాజును

7
వీరుడగు నీలో పొందగలిగినది భారతి. ఈ దీపకళికను పూర్తిగా వెలిగించితివి. రమ్ము (కౌగిలించుకొని)

ఎవరి యాగాగ్నులైన వార లేకబోయి, భువనకల్యాణశక్తి స్వతంత్రమైన
శక్తు లన్యోన్య సంశ్లేష సక్తు లగుచు, కలిసి వెల్గి, జగజ్జ్యోతిగాగ మనుత!

( తెర )

## తృతీయరంగము

(అశోకారామములో - మాట్లాడుకొనుచు ప్రవేశము తిష్యాశోకులు.)

అశోకుడు

కాంతమ్మా, ఇన్నాళ్లుగా పూర్ణకలశమగు నీహృదయ మిప్పు డెండిపోవుటకు కారణము?

తిష్యరక్షిత

నా ప్రారబ్ధముచే నేను ప్రవేశించిన మఱునాడే మృగరాజు మృగశాబకమగుట తటస్థించినది. నా హృదయప్రకృతి కేది ప్రేమాస్పదక మైనదో, ఆత్మార్పణేచ్ఛాజనక మయినదో, అట్టి కాలాశోకత్వమున ప్రియదర్శిత్వ మనుభూతి కాజొచ్చినది.

అశోకుడు

కలశము నిండుటతో పొర్లిపోవునట్లు నాకువలెనే నీకును బుద్ధసాక్షాత్కారదినము సమీపించెనేమో!

తిష్యరక్షిత

మీజీవిత మనుగంటియుండుటచే నది సంభవమైనది. కాని నాలో యౌవనోషస్సు వికసించినదాయెను!

అశోకుడు

తథాగతుడు సన్యసించునరికి యశోధరలో యౌవనము వికసించలేదు. సరికదా తొంగిచూచుచునే యుండెను.

తిష్యరక్షిత

యశోధరలో నాలోవలె స్వార్థరేఖలు తీర్చిలేవంత. నేనేమిచేయను? ఆనాడు భీభత్స దృశ్యచిత్రితమైన రణశ్మశాన వీధులలో నా నృత్తగాన స్వనముల బట్టుకొనివచ్చి, రక్తరంజితమైన మీ హస్తములతో నాపాణిని గ్రహించినప్పుడు కలిగిన పులకలో వినిపించిన హృదయగానమింత తొందరలో నిట్లుపసంహరించుకొనుననని తలపలేదు.

అశోకుడు

రాణీ, మనమేకాదు. ప్రేమస్వప్నము లెందరో దర్శించియున్నారు. సంఘమిత్రకంటెను రాకాపిపాసివానీవు?

తిష్యరక్షిత

రాజా, వెఱ్ఱివాడవు. రాణి సంఘమిత్ర మీ వెన్నెల పూవుపై వ్రాలి, యౌవనసుధ నంత గ్రోలి, తన్మయత్వమున

కనులుమూసినది. తన ప్రేమవిహారముల కుపకరించిన యీ పులినసీమలలో వసంత, శరత్తులు గతించి, యిప్పటి యీ హేమంతశిశిరముల ముసురుటను చూచుటకై ఆమె తిరిగి కనులు తెఱువదుకదా?

అశోకుడు

ఆమె రాజమహిషి. నీవో రాజ్ఞివి. అన్ని నక్షత్రములట్లు భ్రమించుచుండ లోకములకు దారిచూపు ధ్రువనక్షత్రమట్లే నిశ్చలముగా కరదీపికతో నిలిచినది. చూచితివా? సుఖస్వార్థియై అదియు చలించసాగిన? ఇంక కష్టకల్లోలవాహిని యగు ప్రపంచమునకు గతి?

తిష్యరక్షిత

చక్కని ఆదర్శము! ఆకసమున ధ్రువతార! భువమున నా రావిచెట్టు! ఇంక మీతో బాటు నాకు పరిచయమై ఇప్పటికినీ పీఠమున నట్లే నిశ్చలముగ నుండి, దినదినము మీ పూజ లందుకొనుచున్న ఈ బుద్ధవిగ్రహమో?

అశోకుడు

పరమబుద్ధుని నిందించుచున్నావు. నోటికి కళ్ళెమే లేదా?

తిష్యరక్షిత

యౌవనముయొక్క ఆత్మను హత్యచేసికొన్న స్రుతరేతస్కనేనా? ఒక్కనో రేకదా మిగిలియున్నది బంధము

అశోకుడు

ఆ. సమస్తమును విజయము. మీ ప్రబోధమునకు ఫలిత మగు ప్రజాసౌమనస్యముతో బాటు రథగుప్త సహకార మును కలిగినది. కృపాపాత్రుడు సేవకుడు కృతజ్ఞుడు. దేశ మును కృతజ్ఞము.

(అర్హాత యశస్వి అభివాదముచేయును.)

తను బలమున సంకలితమైన యీ సామ్రాజ్యమును పాలించుకొనుటలో తమతోడు లేకుండుట లోపముగా నెం చుకొనుచున్నాను.

అర్హాత యశస్వి

వత్సా, సంతోషము. ఈ 14 ఏడుల అజ్ఞాత సేవాజీవి తము నన్ను పూర్తిగా ఆకర్షించి లోబఱచుకొన్నది. రాజ్య లాంఛనము లింక యేమాత్రము నన్ను లోభపఱుపజాలవు. ముఖ్య రాజ్యావసరములపట్ల తప్పక దర్శనము, సహకారము నొసగుచుందును. :అశోకుడు:

కృతజ్ఞుడను. నేనును, నా ప్రజలును అశోకులము. నా రాజ్య మశోకము.

అర్హాత యశస్వి

సరే. ఇంక ప్రకృతము. 'యథారాజా తథాప్రజా' అందు రెరుగుదువా?

అశోకుడు

చిత్తము. నా ఒరవడిలో నెరసు లెక్కడ దొఱలినవి?

అజ్ఞాత యశస్వి

అలకసుందరుడు కారణముగా అంతఃకలహము లాత్మ ద్రోహంతలను ప్రబోధము కలిగిన దేశమే ఆత్మసంపదగల సమర్థుడని మౌర్యుని పతాక బట్టినది చెప్పుము.

అశోకుడు

బింబిసార, అజాతశాత్రవ, మహాపద్మలలో లోపించిన అభయకిరణములు చాణక్యయుతుడగు చంద్రగుప్తుని చుట్టునొక పరివేషమై తోచినది.

అజ్ఞాత యశస్వి

ఆః! తెలియునుకదా. స్వదేశీయుల ఆస్వాప్న సస్యము నీ సామ్రాజ్య సింహపీఠము. మఱి, యువరాజు సుమనుని కాదని రాజ్యలక్ష్మి ఏనిర్ణయముపై నీ కంఠహార మైనది?

అశోకుడు.

అంతయు తమ కృపాకటాక్షమని కూడ మఱువ లేదు. చంద్రగుప్త ప్రతిపాదితమగు సామ్రాజ్య మవిచ్ఛిన్నముగా వర్ధిల్ల జేయుటకు.

అర్హతయశస్వి

అరిదురావహముగ వర్ధిల్ల జేయుటకు గూడ. నీవు సుమ నునికంటె సమర్థుడవని, అతని భుజముకంటె నీభుజము దేశ లక్ష్మి కెక్కుడు ధైర్యహేతువని ఏనాడు నీవు తక్షశిల విప్లవ ములో యవనుల ఆశలు నిరాశలు చేసితివో, ఆనాడే నా ఆశీస్సునుకూడ పొందితివి రాజ్యలక్ష్మి వరణమాలతో బాటు.

అశోకుడు

పితృదేవులయొక్కయు, పితృపాదులగు తమయొక్కయు నాదర్శములు ఛిద్రము కానీయను. శెలవు.

అర్హతయశస్వి

నీ బౌద్ధమత ప్రచార మట్టివానిలో నొకటికాదా? తద్ద్వారమున నీవు పితృ, గురుద్రోహివేకాక దేశద్రోహివి కూడ నగుటలేదా?

అశోకుడు

ఆర్యానార్యద్వేషము నశించి, వర్ణభేదములు నిర్గమించు, భారతజాతీయత ఘనీభవించుటలో, శాంతి సౌశీల్యములు కుదురుకొనుటలో నుపకరించుచు, భారతీయప్రకృతికి సరిపడిన బౌద్ధమతమా గురుదేవ?

ము లేక! (తనలో) ఇదొక అగ్నికణమని పొరబడియున్నాను. రవ్వరూపు చెడని నివురుమాత్రమే నని తెలిసి హాతాశ నగుచున్నాను.

| | |
|---|---|
| కడిగివేసె దేలా? | అతివ కందమే పూవులు, పురుషుని |
| ప్రేమతో. | కంద మగుట కలదా? ॥కడిగి॥ |
| కరుగ జేసెదేలా? | కఱకు కొండలే జలధికి కరుగ |
| రాజుకు | నిలిచెడిదే భూమి? రాజువె! |
| క్షాత్రము కావలదా? | క్షాత్రము కావలదా? ॥కడిగి॥ |

(తిష్యరక్షిత ప్రస్థానము)

అశోకుడు

పురా ప్రకృతిపదో ఉద్ధాన మొందుచున్నది, ఒడ లేదో తెలిసికొనుచున్నది.

(అర్హతయశస్వి ప్రవేశించును)

అశోకుడు (లేచి)

స్వాగతము రక్షక దేవతా, నమస్కృతులు. ఉద్ధృతు లము దీర్ఘకాల దర్శనమున.

అర్హతయశస్వి

దేశహితావాప్తిరస్తు. బుద్ధప్రతి పద్యుత్సవములు జయప్రదము లేకదా? రథగుప్తుడు కలిసికట్టుగా నున్నాడు కదా?

ఆ. సమస్తమును విజయము. మీ ప్రబోధమునకు ఫలితమగు ప్రజాసౌమనస్యముతో బాటు రథగుప్త సహకారమును కలిగినది. కృపాపాత్రుడు సేవకుడు కృతజ్ఞుడు. దేశము కృతజ్ఞము.

(అగ్రాత యశస్వి అభివాదముచేయును.)

తను బలమున సంకలితమైన యీ సామ్రాజ్యమును పాలించుకొనుటలో తమతోడు లేకుండుట లోపముగా నెంచుకొనుచున్నాను.

అగ్రాత యశస్వి

వత్సా, సంతోషము. ఈ 14 ఏడుల అజ్ఞాత సేవాజీవితము నన్ను పూర్తిగా ఆకర్షించి లోబఱచుకొన్నది. రాజ్యలాంఛనము లింక యేమాత్రము నన్ను లోభపఱుపజాలవు. ముఖ్య రాజ్యావసరములపట్ల తప్పక దర్శనము, సహకారము నొసగుచుందును. :అశోకుడు:

కృతజ్ఞుడను. నేనును, నా ప్రజలును అశోకులము. నా రాజ్య మశోకము.

అగ్రాత యశస్వి

సరే. ఇంక ప్రకృతము. 'యథారాజా తథాప్రజా' అందు రెరుగుదువా?

అశోకుడు

చిత్తము. నా ఒరవడిలో నెరసు లెక్కడ దొఱలినవి?

అర్హాత యశస్వి

అలకసుందరుడు కారణముగా అంతఃకలహము లాత్మ ప్రబోధము కలిగిన దేశమే ఆత్మసంపదగల సమర్ధుని మౌర్యుని పతాక బట్టినది చెప్పుము.

అశోకుడు

బింబిసార, అజాతశాత్రవ, మహాపద్మలలో లోపించిన అభయకిరణములు చాణక్యయుతుడగు చంద్రగుప్తుని చుట్టునొక పరివేషమై తోచినది.

అర్హాత యశస్వి

ఆఁ! తెలియునుకదా. స్వదేశీయుల అస్వాప్న సస్యమే నీ స్వారాజ్య సింహపీఠము. మఱి, యువరాజు సుమనుని కాదని రాజ్యలక్ష్మి ఏనిర్ణయముపై నీ కంఠహార మైనది?

అశోకుడు.

అంతయు తమ కృపాకటాక్షమని కూడ మఱువలేదు. చంద్రగుప్త ప్రతిపాదితమగు స్వారాజ్య మవిచ్ఛిన్నముగా వర్ధిల్ల జేయుటకు.

అర్హాతయశస్వి

అరిదురావహాముగ వర్ధిల్ల జేయుటకు గూడ. నీవు సుమనునికంటె సమర్థుడవని, అతని భుజముకంటె నీభుజము దేశలక్ష్మి కెక్కుడు ధైర్యహేతువని ఏనాడు నీవు తక్షశిల విప్లవములో యవనుల ఆశలు నిరాశలు చేసితివో, ఆనాడే నా ఆశీస్సునుకూడ పొందితివి రాజ్యలక్ష్మి వరణమాలతో బాటు.

అశోకుడు

పితృదేవులయొక్కయు, పితృపాదులగు తమయొక్కయు నాదర్శములు ఛిద్రము కానీయను. శెలవు.

అర్హాతయశస్వి

నీ బౌద్ధమత ప్రచార మట్టివానిలో నొకటికాదా? తద్ద్వారమున నీవు పితృ, గురుద్రోహివేకాక దేశద్రోహివి కూడ నగుటలేదా?

అశోకుడు

ఆర్యానార్యద్వేషము నశించి, వర్గభేదములు నిర్గమించి, భారతజాతీయత ఘనీభవించుటలో, శాంతి సౌశీల్యములు కుదురుకొనుటలో నుపకరించుచు, భారతీయప్రకృతికి సరిపడిన బౌద్ధమతమా గురుదేవ?

అర్హాతయశస్వి

త్యాగసేవాప్రధాన సన్యాస మతము బౌద్ధమతమన్న వారి కాపోత మధుర మైన నగుగాని, సప్తసంద్రాక్రాంత శూర శాసకమనీష లగుట నావాసమవదు.

అశోకుడు

అదెట్లు గురుదేవా? శుద్ధోదనుడు జయించలేని, జయించి నిలబెట్టుకొనలేని రాజ్యములను ప్రజాహృదయము లతో కలిపి సిద్ధార్థుడు జయించి, తనపతాకకు శాశ్వత దాస్యము చేయించుకొనుటలేదు? భయముకంటె ప్రేమ ఎక్కుడు పాలితమోహనము.

అర్హాతయశస్వి (భారత పటము చూపి)

భారతమునకు మౌర్యవర్ణము నీవఱకు చెలగకున్న చాలునా? అది అజత్వర్కము నిలువవలెనని ఆశించవా?

అశోకుడు

ఏమిగురూ అట్లు ప్రశ్నించుచున్నారు? దేశమునమాన వునిలో హింసాప్రకృతి, ఆక్రమణబుద్ధి మృగ్యమైన వను కొనుడు. తరువాత భూలోకమే బుద్ధలోక మగుచున్నదికదా?

అర్హాతయశస్వి

వెఱ్ఱితండ్రీ, భూలోకమనగా నీదేశమొక్కటే కాదు కదా. ఒకవేళ అనాగరక తమస్సుల దడవుకొనుచున్న

8
బర్బరనారీనరుల లోనికి నీ ధర్మదీపికను చేకొనిపోయి, బలవంతముగా కొన్ని శతాబ్దములు ముందుకీడ్చి, వారి జాతీయ చరిత్రలను మొదలుపెట్టించిన పెట్టగలవు. కాని, ఆవలికే ఏదోయొక విశిష్టసంస్కృతి కల యవన, హూణ, శక, తౌత్రిప, యూచీ, కుషానుల వెన్ని దేశములు లేవు పైన?

ప్రకృతిసిద్ధ దుర్వ్యాఘ్రప్రపంచశాలిని బౌద్ధసంస్కృతిన్ సాకువు
పడినగోవు
భరతధాత్రి మాటకు విల్వ వచ్చునెట్లు? ఆయుధవిహీనునా ఆయుధాభిశస్తి!

## అశోకుడు

ప్రయత్నము మానవవశము. ప్రచారకులను, శిల్పులను, శాసనకారులను పంపి, కేవలము ఆప్తుల పర్యాలోకనముక్రింద ప్రపంచమంతటినీ బౌద్ధము సధర్మము గావించ సంకల్పించితిని. అటు ఐగుప్త, యవన దేశములు మొదలు ఇటు బ్రహ్మ, శ్యామ దేశముల వఱకు నప్పుడే బౌద్ధపతాకచ్ఛాయలు క్రమ్మినవి. పరిషత్ప్రతిపాదితమైన కథావత్తు గానము చేయబడుచున్నది.

## అజ్ఞాత యశస్వి

అశోక, నీవు చెప్పిన దేశములు ప్రపంచ దేశములలో దశాంశము మాత్రమే. ఈమాత్రపు పనికి పదివత్సరములు పట్టినదికదా, నీవింకను నూరువత్సరములు జీవించగలవా?

అప్పటికి మాత్రము నీ మనోరథ మీడేరునన్న స్థైర్య మెచ్చటిది?

(అశోకుడు తలవంచును)

అర్హతయశస్వి

వినుము.

నిజ బాహుబలమును నిజదేశరక్షగా నిలుపగావలసిన సేనానులు
కవచమ్ములకు మాఱు కాషాయములుజుట్టి, కక్షపాలలు బూని కత్తులకుగ
వీరోచితము శిరోవేష్టధారణ మాని, ముండనమ్ములకు సమ్మోద పడిన
మగధ విహారమ్మై, పుణ్యక్షేత్రమ్మంత వీరవిహారమ్మై వెలిగిపోవ
క్షాత్రజాతి నిర్వీర్యమై నశియించ, భూమి నిర్భారతీయమై పోయినన్నె
భారత మనేకరాజక ప్రగతి జెంది, కడకు బౌద్ధమతమె దిక్కుకానకపోదె?

(అశోకుడు నిట్టూర్చును)

అర్హతయశస్వి

సమరశ్రేష్ఠుడు చంద్రగుప్తునికినై చాణక్యుచే సృష్టియై
అమర స్థైర్య దమిత్రఘాతుకునిచే నైశ్వర్య సంశోభియై
తమదే యౌవనదీధితిన్ వెలిగి, అంతర్ధాన మౌనేమొ బౌ
ద్ధమతోద్ధాన ప్రమత్తులైన 'ప్రియ సందర్శిత్వ' సంప్రాప్తితో॥

(అశోకుడు లేచును)

అస్తుతి యశస్వి

నీతనువు నంటుసుమాలింక లేక నిండదు. నీ ప్రియసు సుఖమా ఛత్త్వనేల కనుల
ముందునా నాటి సుప్రజాస్వప్నాలు [illegible] [illegible] కల కనఘటించునో కాన్వే తండ్రి!

(అశోకుడు సెలవు తీసుకొని వెళ్ళిపోవును.)

(తెర)

# చతుర్థాంకము

## ప్రథమ రంగము

(నందనారామము. నాను, మాను బుద్ధకథ. హోమమాల, కుణాలుడు కూడ శ్రోతలలో నుందురు)

తిష్య (అవగుంఠనముతో, తనలో)

ప్రజలలో నాకా, అశోకునికా స్థానము? ఆయనకున్న పలుకుబడి యంతయు భిక్షువులలోనే! అందులకే భారత మంతయు చైత్య, స్తూప, విహారమయమై పోవుచున్నది... అదిగో కుణాలుడు!... ఎంత అందగాడు! ప్రథమ దర్శనము ననే మనసు నింత పట్టినాడు... అబ్బ! మాతృమోహకము కూడ నగు ఈ వయస్సాంత విగ్రహము నెంత చూచినను చాలుననిపించదు. ...ఊఁ హూఁ! మొన్న వృత్తి సన్యాసము చేయించిన భిక్షువుచే గడ్డ కట్టించినాడే!

(జనులలో కలిసి కూర్చుండును.)

## మాధు

ప్రజశక్తి నిద్రించ భారతవాయువే వారి మేలుకొల్పు ॥ప్రజ॥
కడుపుచెడగొట్ట కలిగినారయ్యా కానిబుద్ధి వారు
తామెపుడు పూజించు తల్లీనొక్కడు తనువంటిచెనవ్ బ్రతుకుచు
పాలబందాలు, పూలసంకెళ్లు పడద్రెంచు కొచ్చెదరులే,
వీరులకు వలసిన హృదయబలమంత ప్రేమతో కడిగెదరా ॥ప్రజ॥

## నాధు

మన దేశంలో శత్రువులు తీసే గోతులికి కారణం అంతా ఎవరయ్యా అంటే, మన దేశీయులే. వారి వ్యక్త్యాభిమాన శూన్యత, పరాధికారసమ్మతి, పరాన్న ప్రియతలు వారి అలసత, నిర్వీర్యతలకు అవి బాధ్ధమతానికీ ఫలితాలు.

## మాధు

ఎట్టిసందర్భమున నెవ్వరికి నైన తలవంచని జాతిలో
ఏమూల కూడ పిరికికందరము లేమి లేనివాడు
స్వప్నములు కనికని చంద్రగుప్తుడు చాణక్యబలమునను
ఒక్క జండాక్రింది కొక్క గడ్డగ చేర్చి సుఖపెట్టాడు ॥ప్రజ॥

## నాధు

వారి స్వప్నాలేమిటయ్యా అంటే, తన జండాలతో సమస్త భారతమునకు రక్షకట్టి, శత్రు పాదధూళి కాని, విజాతి జండాలగాలిగాని సోకకుండ చూచుటయే.

మాధు

పౌరి మరణమువఱకు వైరివర్గము వాకిటనె ఆగారు
వీరలందఱు భిక్షువులైనా విని సంతసించారు ॥ప్రజశక్తి॥
స్వాధారమును జూప పాదములచెంత ప్రజలు పడియుండరనొ
ఆగర్భ శ్రీమంతు లాజన్మ కృషికులకు ప్రతినిధులు ఎట్లాగుదురు? ॥ప్ర॥

నాధు

అంతకు కారణం బౌద్ధమతం అని, రాజు దానధర్మ విధానం అనీ, మనలో మనం నోరు, నోరు కొట్టుకొంటే ఏంలాభం? ఎంతటి యుదారులైనా, ఏవ్యక్తులు ప్రజాక్షేమ పాటకానికి చాలరు. చాలినా అది దుర్భరం. సంఘుచల నానికి రాజు, రైతు ఇద్దఱు భాగస్వాములే.

మాధు

సత్రములు, ధర్మములు, భృతులు, మాన్యములు కుంటి గ్రుడ్డి కండీ
ఒకరు పెట్టిరని, తాము తీన్నామనీ ఆమాట దుర్భరము ॥ప్రజ॥

నాధు

ధనస్వాముల ధనరాసులయినా శ్రమిక హస్తాలతో పోసినవేకదా! కృషిక వృక్షాలకి పాకిన బదనిక లేకదా స్వాములు. అందరికీ నోరాకటే. వారు దశవక్త్రులు కాదు, వీరికి నోరు లేకను పోలేదు,

అనుకంపయున్న పరిపాలి ప్రాణ, మానములు నిలపండి
సోదరుల క్షేమంపుల కృషికోద్యోగుల చిటుచిటులు వినిపింపవు ॥ప్రజ॥

నా ఘు

అసలు శౌర్యాన్ని అశోకుండె నిలిపాడు యువరాజు
వీరపత్నిమన రాణీగారు దానను కీర్తించుదు ॥ప్రజ॥

వరా ఘు

తలోపములు వినుము వేగ సంక్రమించెను మహారాజు ధర్మాత్ముడను
మన ప్రజా వ్యాపారమును మహీపతికి తెలిపె మార్గమును
చాటాలి ॥ప్రజ॥

(నిష్క్రమింతురు)

కునాలుడు (లేచి)

జ్యేష్ఠ చక్రవర్తి కి పెకేగు రాయబారవర్గమునకు నన్ను నాయకునిగా ఎంచుకొని, మీరందరు నాకు వెన్నుబలము చేయుడు. నన్ను ప్రయోగించుకొనుడు.

హేమమాల (లేచి)

ఇవిగో మన వాంఛలు (1) బౌద్ధమతము నైచ్ఛికము చేసి, ప్రఖ్యాత యోధజాతులందు చేరకుండ నిషేధించుట (2) భిక్షుకవృత్తి నిషేధించి, సామాన్యప్రజలకు శరణాలయములు, ధర్మభృతుల ద్వారమున కాక ప్రభుత్వము స్వయముగా పనిచూపి, అభిమానద్యోతకమును, శౌర్యదీపకమును స్వాతంత్ర్యవర్ధకము నగు స్వయంజీవనమును కల్పించుట (3) రాజు ఆలోచనా సభలో కృషికప్రాతినిధ్య మొసగుట.

జై! ప్రజాశక్తికి జై! శాంతిభారతికి జై! అశోకభారతికి జై!

([illegible] స్వాగతా లేచి, జారిపోవును.)

అంగజు ([illegible])

వీరభూమి కర్మభూమై, శూరభూమి కరుణభూమై
భారతభూమిని శౌర్యసింహాల నొద్దవోయివి ॥వీర॥
కరుణ మదియొక కళంకితమే, ప్రకృతిలో మిగిలెడిది వీర్యమె
కరుణ మతమును శెలవొసంగుడీ! బలమతమునకు సెలవొసంగుడు॥వీర॥

(తెర)

# ద్వితీయ రంగము



(తిష్యారామములో శృంగార మందిరము—పూలతో నైలు,
(ఆసనములు. చిత్రఫలకమున కుణాలుని చిత్రించుచు ప్రవేశము.)

తిష్యరక్షిత (కూర్చుండి)

రాలుపూవులో జాతిపూవులో! ...తేనెకలవారొ
ఈ పువుల తేనెకలవారొ! ఈ జగతి కెదవ లేదారొ!

ఇద్దఱికి నొకేమాట! నాఒక్క పొరబాటుతో అఖండ భారతసామ్రాజ్యము యొక్క అకళంకితమగు తృతీయ తథాగతశక చరిత్రమునెడ నధిక్షేపకాంగుళి నిలుచునట! రాతి బొమ్మలగు రాజ్యలక్ష్ములను సహావధువులుగనె నిలిచిన భారత పట్టపు లక్ష్ములలోను రసాధిష్ఠానాంగమగు హృద

యము నభిమానించుకొన్న మానవ కిరణ మెక్కటున్నదని నిలుచుగాక! ఏమి వేదాంతము! స్త్రీలువిన్న నవ్విపోయెదరు. ఎంత పరాఙ్ముఖము! ఎంతపత్నీగత ప్రేమ!... అవును. రాణీ వాసపు సౌందర్యవతి తానుగా చేరికోరుట! అలుసు కాదా మఱి! హృదయమెంతటి సామ్రాజ్యభావవిముఖమైనను తన పై నేకచ్ఛత్రాధిపత్యము వహించ నొప్పుకొన్న హేమదయే అణువణువు క్రమ్ముకొన్నదట! (ఒక ఆకుకోసి, పరీక్షించుచు) స్త్రీలోకమున నెవరికినీ లేకపోయిన పోవుగాక. నాకుమాత్రమా అతిలోకమోహనాకారముపై నధికారము కానలెను. నా కొక్క తెకే అయిన నది నా లోకాతీత సౌభాగ్యమనవలెను. మహాత్ములు కలవారితో మనసిచ్చి పుచ్చుకొనువారి దే ధన్య జన్మ. పోనీ, యిచ్చుకొననైన లేనా ఆయపరూప రూపఖనికి? నే ననుభవింపరాని సౌందర్యమూనా? (ఆకు రెండుగాచీరును) అబ్బ! లోన, పైన, అంతయు నందమేనా? నాకు లేని భాగ్య మెవరికినీ లేకపోవుగాక! హేమకును... (పార వేయును) చూతునుగాక! రాణి ఆజ్ఞగా ఆజ్ఞాపించిచూతును. బెదిరింతును. ఎవరక్కడ? ప్రవీణా? ... వేగమేపోయి, ఇప్పటివఱకును మాటాడియేగిన రాకుమారునితో నామాటలుగా 'మహారాణి ఆజ్ఞలకు లోబడి...' వద్దులెమ్ము. నేనేస్వయముగా కనుగొందును.... పోనీ, ప్రవీణా, నీసొమ్ములు, చీరె,... ఊః, ము స్తీ బంతయు తెచ్చియిమ్ము......పొమ్ము.

(చెలివచ్చి నమస్కరించి వెళ్ళును)

(కుణాలుని పటముచూచి) ఎంత ఆందమున్నదీతని కన్నులలో?... ఈకన్నులుకొంచెము తగ్గించి, గడ్డమునకు

9
కొంచెము తెలుపు వేసిన, అచ్చము అశోకమూర్తియే!

అతనికన్నుల నిగ్గుమించెడి అమృతదృష్టులు తనువు నణువుల
ముసురుపట్టి, దబాలు—జల్లున ముంచివేసెడవే!
ఆబిగించిన వాని నేత్రములందు వాలుగట్టి, కాయము
నంతను కితకితలలోనించి, పులకవేసెదవే!
తీపితుంపురులను విదిల్చుచు, చూపులాగిన చోటుచోటున
జిలుగువెల్తురు నగలతోరణములను నిల్పెడవే!
అప్పుఅప్పుకు తూర్పునార్చి, అందమునునాసైన సొబగుమ
వ్రేళ్ళతో నామనోధైర్యము లేపివేసెడవే!
నల్లకలువలు, మల్లెపూలూ, జల్లుగావర్షించి కన్నులు
చూపుతుమ్మలపైకి విసురుచు సొక్కజేసెడివే!
ఒకటిగా పదివేలమెఱుపులు జిగిజిగై ఆననుల వెలుగడ
ఒడలి అణువుల దూసుకొనుచూ నిండుకొంటావే!
(కనులుమూసి ఆసనముపై వెనుకకు వ్రాలి)

అబ్బ! నన్నింత మోహపెట్టుచున్న అతనికనుల నీపెన పులకరించుకొన వలసినదే!

(తెర)

## తృతీయరంగము



(నాణెములతో స్తంభనిర్మాణము చేయుచు కూర్చుండి)

కుణాలుడు (ఆలోచనతో)

ఒకనికిచ్చుకొనుటకయి ఒక్కమొదట పడతి ఆత్మయింక మ్రోవుపడగలేను.
కామముపవిత్రమవలేదు ప్రేమపేర నామెయెద వారియెద జిక్కుఅరుగదేమి?

హేమమాల (ప్రవేశించి)

ప్రభూ, ఎంచుకొన్న హృదయరాజ్ఞిని. నాకే దివ్యములు కాని భావములు కలుగవే! గుణమోహానులను వీమ్మగాంచి, మొక్కబోక, మోహింపవలసి, వ్యాకులపడుచువారెవరో?

తిష్యరక్షిత

( చెలి వేషమున, అవగుంఠనముతో ప్రవేశము )

రాధా ఆది ముగ్ధలోకమునకు (స్తంభములోని నాగములు తీయుచు) పూజనీయములయిన శ్రీకృష్ణుని జగన్మోహన గుణములు సత్యకు మోహోస్మేలకములు కాలేదా?

హేమమాల (జనాంతికము)

సాహసియే! తెగించినది; చాటొకో వేషమునన్, ముసుంగు? హా!
మోహమదెంత చేయు; గుణమోహాను, ఫుగ్రు, గుణాలు నిట్లుగా
నీహదలిర్వ సాగినది; హేమకు, రాజుకు, సింహపీఠికిన్
ద్రోహము సేయ జంక దిసిరో! అవమానము సాధ్విజాతికిన్

(తిష్యరక్షితతో) ఎవరమ్మానీవు? దయుడుంచి మాకన్యోన్యమును ప్రసాదించుము.

తిష్యరక్షిత

మహారాజ్ఞి శ్రీ శ్రీ తిష్యరక్షితాదేవి ఆజ్ఞ.

కుణాలుడు

మొదట నీవెవరవు? ఏమి చేయుచు నిలబడి, మాటాడుచుంటివో జ్ఞానముండియేనా?

తిష్యరక్షిత (ఆపి)

నేనా? ఇంతలోననే ఇంత మతిమఱపు తటస్థించినదా లేక సౌందర్యగర్వమున కనులు మూతవడినవా?... మన్నిం పుము రాకుమారా, ఆరోజున ఆమునిమాపు వేళ, నన్నుసరిగా చూచియుండవు. పెరవారు వత్తురని పైపైచూపులే పఱపి యుంచువు. కనుతెప్పలెత్తుసరికం దేరాజో నిండి, వ్యాపించి నన్నుచూడనిచ్చి యుండరు. చూచియేయున్న, నాసౌంద ర్యము తిలకించియేయున్న, ముగ్ధముకానంతటి గాజుపెంకులు కావు నీకనులు. అబ్బ! ఎంత అందమున్నది నీకనులకు! స్వయ ముగా తాము సుందరములగుట, పెర సౌందర్యము నెఱుగ లేకపోవు.

కుణాళుడు

నీవా సోదరీ, కలాంపమొక్కటి కాలేదుకాని, నేను వివాహితుడను.

తి ష్య ర క్షి త

అందులకే ఇంతప్రార్థించునది, ఇప్పుడే వచ్చినదిన్నీ. ముంజేతి కంకణముల కద్దమేల? ఎన్నుకొను మిద్దఱము నున్నాము.

కుణాలుడు

ఓషధీస్ఫోరక మగు చంద్రజ్యోత్స్నలకు వలె, మించు తీవలకు మొండిమ్రాకులు పల్లవించునా? ఏటిమాట! వచ్చిన కార్యమెరిగించి, అనుగ్రహింపుడు.

తిష్యరక్షిత (కోపముతో)

మహారాజ్ఞికి ముదముగూర్చుచు యౌవనరాజ్య, యౌవన రాజ్యపట్టములు కట్టుకొందువా? అయిష్టముగూర్చి, తక్షశిలకా జీవితము ప్రతినిధిగా పోదువా? ఇదిగో రాణియాజ్ఞ!

(ఆజ్ఞాపత్రమిచ్చును.)

(కుణాలుడు చదివి హేమకిచ్చును)

హేమమాల (అందుకొని, చదివి)

ఊ! పెద్ద పన్నాగముతోడనే వచ్చినది. నా కర్తవ్యమున నేనుండవలెను. (జనాంతికముగా)

పార్థివపుత్రికామణుల పావనభారతమాతృమూర్తి పూ
జార్థముగాదలంచి, శిరసావహియించితి, మెప్డు దానినై
చ్ఛార్థ మెఱుంగనైనదో మహాత్వతలమ్మున నుండనిచ్చుటన్
అర్థములేదు. ఏరి పురుషున్న విధమ్మున ద్రోయగావలెన్.

(ప్రస్థానము.)

తిష్యరక్షిత

జ్వాలూకకుమారుడు మగధకు రాగలడు.

కుణాలుడు (తనలో)

సూర్యుడు జగత్తువెల్గించుచోటుతప్పి,కొండగుహాలోన, హేమూలోతూరుచుండి వెంగలీనుటు కెపుడైన వేడ్క—పడునె? ఐన దీన జననిజోక్య మూననేల?

తిష్యరక్షిత

ఏమో!నాకెందుకు? నాపనియైనది. సెలవు. (అభివాదం)

కుణాలుడు

నా యొసగు నుత్తరము విననిదేనా?

తిష్యరక్షిత

ఆలోచనలో పడిన దేమి? చెప్పుము. ఆలోచించియే జవాబిమ్ము. ఎంతగడువు కావలెను? శాంతిస్ఫోరకమగు నుత్తరము నాశించుచున్నాను. వలసిన నాజన్మకాలము నంతను తీసికొనుము. వ్యతిరేకోత్తరము మాత్రము రానీకుము. నిన్నుకోరునదియు, ఆనాడు నీతో సంభాషించినదియు, మహారాణిని 'నేనే' తిష్యను. (అవగుంఠన మెత్తివేయును)

కుణాలుడు

ఐన నది మఱింత దౌర్భాగ్యము.

జ్ఞానముకల్గి, నాగరక సత్వము నొందిన పెద్దజాతి రా
రాణినె మాయుత్రోవలకు లాగగజాలు సురూపసంపదల్
కానగరాని దూరమున గల్గుట దేశహితమ్ము. శిలస
మ్మానముగూడ నొక్క అతిమానవరూపము దాల్చకుండనే.

లోకముకొఱకు, మహారాణి నాదర్శనారి గావించు కొఱకు, తక్ష—

తిష్యరక్షిత (అడ్డువచ్చి)

ఆగు మర్థమైనది నీమానసస్థితి. అంత్యనిశ్చయము చేసి

వేయకుము. ఇదిగో...అశోకునితో వివాహముకాలేదు నాకు. 'ఉపాసక' దశలో నొకటిరెండు పర్యాయములా విషయ మెత్తితిని. అతడు "మనకు పెండ్లి కాలేదని ఎవరనగలరు? నీవొక్కతెవే ప్రస్తుత భారత సమ్రాజ్ఞివి. చెల్లిపోవుచున్నది కదా. ఇన్నాళ్ళకిప్పుడీ కలాపమెందుల" కని త్రోసిపుచ్చి నాడు. ఈ రహస్యము నీకుచెప్పుచున్నాను.

అర్హత యశస్వి (ప్రవేశించి)

రాణీగారా? నమస్కారములు. మీరాజ్ఞ యిడిన, కుమారులే రాకపోయెడివారా? ఏమంత అవసరకార్యమని యిట్లు వాదచారులై యొంటరిగా దయచేయుట? వృద్ధరాజు నొక్కయువవధువు. యువరాజుగృహమున! ప్రజలకు తెలిసిన బాగుండదు. ద్వారము చెంత రథమున్నది. మీ భవనము నకు పొండు. ఇప్పుడే కుమారుని బయలు దేర తీసిపంపుదును. మీరురాణులు! లోకాదర్శమూర్తులు!

తిష్యరక్షిత (తనలో)

రాణి స్థానమున నుండుటకూడ నదియొక దౌర్భాగ్యమేనా? (పైకి) పంపుడు! కనిపెట్టుకొనియుందును.

అర్హత యశస్వి

ఆజ్ఞ తక్షణము.

(తిష్యరక్షిత ప్రస్థానము)

(తెర)

# పంచమాంకము



## ప్రథమరంగము



(అశోకారామము — క్రింద ప్రజల సందడి — మేడ పైఅంతస్థులో తిష్యరక్షిత, అశోకుడు మాటాడుచుందురు.)

తిష్యరక్షిత

కుణాలుడే యేమి? మీ పుత్రు లందఱును మీ కెదురు పతాక లెత్తుచున్నారు.

అశోకుడు

ఆసంగతి నట్లుంచు మిప్పుడు. అటు వినుము. ఆర్తులై నా భవనమునొద్ద చేరిరి ప్రియ! ఈ ప్రజాగత ప్రాణిని నన్ను వెళ్ళి తీర్చుకొననీయవు ?

తిష్యరక్షిత

భారత వైద్య ప్రపంచమున తమ యేకైక ఛత్రపతి ప్రియదర్శిని బ్రతికించుకొనగల వ్యక్తి కఱవుకాగా, తన సౌభాగ్యము నిల్పుకొన్న తిష్యను! నమ్మరా నాథా? పంపుడు, నేను తీర్చివత్తును.

అశోకుడు

పగలనక, రాత్రియనక అంతఃపురమనక, ఆలోచనా

మందిర మనక, నా ప్రజ లెవరికైనను నేను దర్శన మిత్తు నని, వారి క్షేమమునకే జీవింతునని, అందు నా కలసట, తుష్టి లేవని చాటించితిని ప్రియా! మాట దక్కించవు?

తిష్యరక్షిత

అట్టి కీర్తి మీ అర్థాంగికి దక్కరాదా నాథా?

అశోకుడు

నా ప్రజలు తిష్యా! వారి ఆర్తి నేనే స్వయముగ బాపి కొనవలె నను కోరిక నాకెంత గాఢముగానున్నదో, ఎవరికి తెలియును?

తిష్యరక్షిత

నాకును తెలియదా? మఱచితిరేమొ. ఆనాడు బుద్ధ ప్రతిపత్తుకు ముందు కుమారరాజు మీ ఆహ్వానము తిరస్కరించుటే కాక, మన మొసంగిన భిక్షము నా భిక్షుకునిచే నేల పాలుచేయించి, వానితో చేయిచేయి కలుపుకొని యేగినాడే, ఆ దినమున మీరిచ్చిన మాట మఱచితిరేమొ!

క్షితిపయి సప్రమాణములు సేసియు 'అర్హతు' లౌదురో "తథా
గతు నవతార కార్యమున కాలము బుచ్చుకొనంగ నిచ్చు ప
ద్ధతి నొక రాజ్యచాలన విధానమె యేమి? మరేమొసంగ నం"
చతిధృతి వాడి, నన్ను నుతయమ్ముల దన్వరె, బౌద్ధరీతియా?

అశోకుడు

నేను దుర్బలుడను రాణి. నా సర్వరాజ్యమును నాతో కలిపి పాలించుకొనుము. కాని ఒక్కసారిమాత్రము నా ప్రజల

ముందు నిలిచి కలవు తీర్చుకొననీయవు? (కిరీట మామె శిరమున నుంచి, చేతులు పట్టుకొనును)

తిష్యరక్షిత

అట్లుకాదు.

కత్తిగాను నవసరములు కానప్పుడు చేడె మాత్రము రాజ్యముచేయలేదె?
బౌద్ధరాజుకంటె చెలి ప్రబుద్ధయగుటు, నిప్పుడె నాదు రాజ్యారంభ మెసగుగాక!

అశోకుడు

పోనిమ్మొక్క మాట చెప్పివత్తును.

తిష్యరక్షిత

నేటినుండి రాజుతో చెప్పుకొనవలసిన సన్నియు రాణితో చెప్పుకొమ్మనియేనా ?

అశోకుడు

కానిమ్మొమాటయైన చెప్పి, నాప్రజలయెదుట చివరసారి నిలిచి, కనులతోనే శెలవు తీసికొనివత్తును.

తిష్యరక్షిత

వద్దు. అదియు కూడదు. బిక్కుతనముతో నెఱ్ఱబడిన మీ సహజ శాంత ముఖమండలమును, వాత్సల్యవర్షకములగు మీ స్నిగ్ధనయనములును, ప్రీతిస్ఫోరకములగు మీ వచోవృష్టులును... అబ్బ! వారియెదుట పడనిచ్చులే!

అశోకుడు

సరే. వారిని నేనాదరించునట్లు ఆదరించి పలుక

రించుము. క్రైశోరలలితము జనుల సత్వము. చెదర గొట్టకుము. వారిలో కుణాలకుమారుడుకూడ నుండవచ్చును, వెళ్ళిరమ్ము. కనిపెట్టుకొనియుందును. వెళ్ళిరమ్ము. ఎదురేగి. ఆదరించు, ఔదార్యము. అందఱు నొక్కుమ్మడిగా ఇట్లు కట్ట కట్టుకొనివచ్చుట కేమి కల్గినదో!... ...ముందుగనే 'ఏ' మని యడుగక, వారి 'ఆర్తి యేదైననుసరే తీర్తు' మని బాస యీ వలెను సుమా!

తిష్యరక్షిత

నన్ననుమానించకుడు. వారు మీప్రజలుకారు, నా ప్రజలు. కుణాలుడు నా కుమారుడు. ఏమయిన నన్నుచో సవతితల్లినందురు. పుత్రప్రేమ ఎద నిండి, కనుల కెగతట్టి, అంధులరై తిరి. రాజు బౌద్ధపతాకా ప్రతిష్ఠాతి; యువరాజు భారత నిర్బౌద్ధీకరణవాది! రాజు తథాగత ప్రతినిధి నను కొనిపాలించును; పుత్రుడు సమస్త భారతీయులను పందెపు గవ్వలు గావించి, గిలకరించి, క్రిందుమీదుచేసి, పాలకవర్గ మును చిత్తు, పాలితుల మూకలను బోకు గావించజూచుచు రాజజనకుల కెదురు విప్లవము నడుపు ప్రతినాయకుడు. ఈ రాయబారమునకు నాయకు డతడే కావచ్చునుకూడ.

అశోకుడు

కుణాలుడే నాయకుడు? అట్లయిన ప్రజల కేదో మహార్తియే కలిగియుండును!... ఏమొ! వ్యక్తిత్వము నణచి మూల నుంచితివి. సరే; అంతయు నీ సుబుద్ధికే వదలితిని.

జగత్కల్యాణము నీ హృదయమున వసించి నడుపుగాత ! వెళ్ళిరమ్ము. ముందు ప్రజల యార్తి తీర్చిరమ్ము.

తిష్యరక్షిత

నన్ను విశ్వసించి ఈ విషయమును నాకు వదలుము. మీ సాభిప్రాయ మెంత చూఱగొందునో చూతురుకాని.

(ప్రస్థానము)

(తెర పడి, వెనుక తెరతో కలిసి తిరిగి లేచును)

హేమ, నాథు ప్రజా రాయబార వర్గమునకు నాయకమణులుగా నిలిచియుందురు తిష్యరక్షిత కిరీటము పైగా అవగుంఠనముతో ప్రవేశించును.)

హేమమాల

ప్రభు వెక్కడ మహారాణీ! వారిని దర్శించవలెను.

తిష్యరక్షిత

మే మున్నాముకదా. దర్శించితివి; మనవిచేసికొనుము.

హేమమాల

అట్లుకాదు మహారాణీ !

తిష్యరక్షిత

అట్లుకాదు మహారాణి! మహారాణులమని యొప్పు కొనుచున్నావుకదా. మనవిచేసికొనుము. కాని నీవు వచ్చినది వేమి? కుణాలుడు ?

తక్షశిలకు ప్రయాణమై చనిరి. ఇప్పటి కప్పుడే నైశాలి చేరియుందురు.

తిష్యరక్షిత (బింకము తెచ్చుకొని)

ఔమ్మ. నీవు మాత్రము మహారాజును దర్శించ వచ్చును.

హేమమాల (ప్రజలతో)

వత్తు నాగుడు. (ప్రస్థానము)

తిష్యరక్షిత

(భటునితో) ఆమె భద్రము. (ప్రజలతో) మాప్రియ మైన ప్రజలారా! నేటినుండియు రాజకార్యములు మేమే నిర్వహించుచున్నాము. అహింసాయుధహస్తుడగు వృద్ధరాజు కారణముగా దేశమున పరరాజులకుట్రలు ప్రబలుచున్నవని తెలియుచున్నది.

నాథు

అందుకేనా తల్లీ, యువరాజు తక్షశిలకేగినది?

తిష్యరక్షిత

యువరాజును ఒక్క నెలరోజులలో తిరిగివచ్చును. ఆయనయే మీసౌభాగ్యము శాసించును. నాది నడమంత్రపు రాజ్యాంగమే.

ప్రజలు

జై! మహారాణికి జై! యువరాజుకు జై!

తిష్యరక్షిత

అశోక నాథులవలెనే మాపాలనలో లోపములందేశించినవారికి కృతజ్ఞులము. మీ ఇప్పటి ఆగమనోద్దేశ్యము మాకు ముందే తెలియును. మీ యభీష్టము తీరు నేర్పాటులు జరుపుచున్నాము. (ప్రస్థానము)

నాథు (జనాంతికము)

ఇందేదో అగాధ రహస్యముండును. (ప్రజలదిక్కై) జై! ప్రియదర్శి నృపాలునికి.

(అందఱు జయధ్వానములు చేయుచు ప్రస్థానము)

ద్వి తీ య రం గ ము

(తిష్యరక్షిత నర్తనశాల—ప్రాంగణము, ప్రవేశము)

కుణాలుడు (చేతిలోనొక లేఖ)

స్త్రీహస్తాక్షరములు! ... వ్రాలులేదు... హేమకా, తండ్రిగారికా గ్రస్తత? రాణినాట్యమందిరమనుసరి కే ఒడలు జలదరించుచున్నది.

(తెరలో గంటలు, గానము నృత్యము... తెరలేచును. బుద్ధవిగ్రహము ముందు నాట్యపూజాభంగిమమున తిష్యరక్షిత ప్రవేశించును. కుణా

లుడు నమస్కరించును. తిష్య కనులతోనే స్వీకరించి, బుద్ధ విగ్రహా
మున కర్పించి, అతనిని కూర్చుండుమని సైగచేయును. కుణాలు
డొడలు మఱచి కూర్చుండును.)

తిష్యరక్షిత (నాట్యము)

జయజయ బుద్ధమునీ । శౌద్ధోదని । జయజయ బుద్ధమునీ
గ్రథితయశోధర మానస । జితమానస । విశదవిశ్వ శుభకాంక్ష
(హారతినిచ్చి, కుణాలుని కందించును. అతడు స్వీకరించును) ॥జయ॥

కుణాలుడు (ఒడలు తెలిసికొని)

తలుపులన్నియు బంధించియున్న వేమి? ... నే నిక్కడ?
... ఇదేదో ఘాతుకమృగి గుహావలె నున్నది!

తిష్యరక్షిత

తెలుపనైన తెలుపక యే లోనికివచ్చితి వేమి? తెలిసిన
ఆహ్వాన సమ్మానము లేర్పాటుచేసెడి దాననే?

కుణాలుడు

తల్లులు వాత్సల్యవృష్టి కురియుటయే తనయులకాహ్వా
నము, సన్మానము, తండ్రిగారెక్కడ తల్లీ?

తిష్యరక్షిత

కుణాలా, సుగతుని బూజించు నా ఆరాధనా విధాన
మెట్లున్నది?

కుణాలుడు

మూర్తిమతీ, ఋణాగ్రస్తుడను. ఇందలి కళాశాల మీా నాట్యశక్తి కేమమార్లు చలించి, తుషితస్వర్గమున కెగసి నట్లును, ఈ బుద్ధవిగ్రహామునుండి మైత్రేయబోధిసత్త్వుడుద్భ వించినట్లును మూతలువడిన నాకనుల కేమొ తోచినది.

తిష్యరక్షిత

సౌందర్యము నర్థముచేసికొను హృదయమే కుణాలా నీది!

కుణాలుడు

హేమ యెచ్చట? ... ఆమెకువచ్చిన ఆపదయేమి?

తిష్యరక్షిత

ఆమె కేమి? సుఖముగనేయున్నది. కొంచెము సేపటిలో ఇక్కడికే రాగలదు ... దాని కేమి, హేమకీ భంగిమము వచ్చునా?

కుణాలుడు

నాకే యిప్పుడు వచ్చినది. మతిగ్రస్తత తండ్రిగారికా?

తిష్యరక్షిత

హేమవలన ఈభంగిమము మొదటగా చూడగల్గిన?

కుణాలుడు

భాగ్యవంతుడ నగుదును; తండ్రిగారికి క్షేమ మేనా? దర్శించవచ్చునా?

తిష్యరక్షిత

ఆ. క్షేమమే. మఱి చెప్పుము. హేమయే నేనైన?

కుణాలుడు (కొంత ఆగి)

నా జీవితమే మధురించిపోవును.

తిష్యరక్షిత

ఊఁ! హేమలో నీ ఆత్మార్పణకు యోగ్యమగు సౌందర్యమేమున్నది? కష్టజీవులలో కలిసిమెలిసిన హేమ వెన్నెల విడిచిన శశి. సౌందర్య మారిన పూవు.

కుణాలుడు

హేమ నా సహచారిణి. జీవించుట యేమొ ఆమె యొద్ద నేర్చుకొన్నాను. నేనామెకు నృత్య, గానములలో గురువును. మా జీవితముల కలఁబోతలో నూతనసౌందర్యము లూరుచుండును.

తిష్యరక్షిత

ఆమె జీవిత మర్ధవంతమైన కావచ్చును. కాని, నీ జీవితము నిస్సారము, నేనయినచో జ్యోతిర్మధువు వెన్నెలరూపమున కాయుదును. (తనలో) ఇప్పుడది అడవుల బట్టిపోయినది.

కుణాలుడు

తండ్రిగారి భాగ్యము. భారత దేశ సౌభాగ్యము.

తిష్యరక్షిత

అదిసరియే. మఱి నేనే హేమనైన? నా జీవితముతో మేళవించు నీ జీవిత మెట్లుండగలదో?

కుణాలుడు (లేచి)

తల్లీ, నన్ను పిలిపించిన తండ్రిగారెక్కడ? మతిమఱచి మసలుచుంటిని. (తలుపు వేసినధ్వని) తలుపెందుకు వేతురు?

తిష్యరక్షిత

కుణాలా, కూర్చుండుము. తండ్రిగారు కాదు, హేము కాదు. నేనే పిలిచినది. కూర్చుండుము. ఈ ఆసనము నీకే. ...చూచుచు నిలబడెద వేమి?... ఇవిగో పూలదారులు పఱచుచున్నాను... మెల్లగా, మెల్లగా నడచిరమ్ము. నాహృదయాధిష్ఠాన దేవతా, దయచేయుము.

కుణాలుడు

ఇదేమితల్లీ, ఇట్లుమాటాడెదవు?... (లేఖచూపి) ఇది వ్రాసినదెవరు? (చదువును)

"నీవు ప్రేమించిన ఈవ్యక్తిని చూడరావలసినది. రాణి ఆజ్ఞాపత్రము కూడ దీనితోడనే అందగలదు. నీదర్శనమున నా అస్వస్థత నెమ్మళించునను ఆశకలదు. స్థానము—రాణినాట్యమందిరము."

సంతకము లేదు. ఎవరునన్ను మగధకు తెచ్చినది?... ఇవి స్త్రీహస్తాక్షరములు... ఎవరికి నాకృతజ్ఞతానివేదన?

తిష్యరక్షిత

అట్లడుగుము కుణాలా, చెప్పెదను. నేనే నీవు ప్రేమించిన వ్యక్తిని. (పూలు కొన్ని పఱచి) రమ్ము కుణాలా, అడుగిడుచుండుము. (కుణాలు ఒక్క అడుగిడును.) నిన్ను నేనే

వెనుకకు తెచ్చుకొన్నది, నాకేఅస్వస్థత, నాకే నిన్ను చూచు కోరిక. ఈ హస్తాక్షరములు నావే, నాకే నీకృతజ్ఞతానివేదన కావలసినది. (మాటమాటకు అడుగిడుచుపోయి, పూలు పఱచుచు, తటాలున ఆగి, వెలవెలబోయి) ఏమి కుణాలా, నీవు వచ్చుచుండుట లేదా? రమ్ము, రమ్ము, (బుద్ధవిగ్రహము తీసి వైచి, పీఠమున పూలుచల్లి) దయచేయు మిక్కడ దయచేయుము కుణాలా. ఇది వట్టి అచేతనము. దీనికి హృదయము లేదు. సౌందర్యగ్రహణశక్తి లేదు. నా నాట్యపూజ కిదితగదు. నిన్నారాధింతును రమ్ము. (కుణాలుడు కదలడు) పోనిమ్మిక్కడనే నిలబడియుండుము. ఆరాధకురాలే తన ఆరాధ్యమూర్తియొద్దకు రావలెనులెమ్ము. (చేతిలో పూలతనిపాదములపైపోసి, ఒక విన్యాసము చూపబోవును.)

కుణాలుడు

అమ్మా! మీకు మతి చెడలేదుకదా. ఇదేమి? నేను పుత్రుడను. శౌద్ధోదనిని కాను. మహారాజును చూడవచ్చితిని. తిరిగి నన్ను నాప్రజలలో వేసినందులకు కృతజ్ఞుడను.

తిష్యరక్షిత

మహారాజా? భారతసమ్రాజ్ఞీ హృదయ పట్టభద్రుడవు నీవుకావా? ఈప్రజ నేలుకొనుము.

(మోకరిల్లును)

కుణాలుడు (తొలగి)

తండ్రిగారు కావలెను నాకు. అస్వస్థతతో నున్నారను కారణమున హృదయము మఱింత ఆతురత పడుచున్నది.

తిష్యరక్షిత

అస్వస్థత?... నాకె చూపుము. ఈ (నాడిపట్టించ బోవు) ఇదెంత తీవ్రముగా కొట్టుకొనుచున్నదో? చూడు మీగుండె యెట్లు కొట్టుకొనుచున్నదో? (అతనిచేయి తనవక్షమున నుంచుకొనబోవును) జ్వరముగానున్నది. మోహజ్వరము! వాంఛాజనితోష్ణము! యౌవన నిదాఘమునకు హృదయము బీటలువారుచున్నది. నీ ఆదరవృష్టియే యీ ద్రోహమును పుష్పింపజేయునన్న, ఎట్లూరుకొందువు?

కుణాలుడు (తనలో)

మించివచ్చినదే?

తిష్యరక్షిత

హేమలో నేమున్నది? నాలో జీవితముకలిగియున్నందుకు ఫలమున్నది.

కుణాలుడు

లక్షలాదిగ స్వచ్ఛందరతులయొక్క కడుపులం జల్లపడుప సంకలితమైన దీవనలలోనిమధురిమ దెలిపె హేమ! ఇంద్రియౌత్సుక్యమున దించదేమియిట్లు

(చూచుకొని) ఇదిగో హేమాదత్తమగు ఈ రక్తాంగుళీయము నా బ్రతుకు రేఖలు దిద్దుచుండును.

తిష్యరక్షిత (ఉలికిపడి, తనలో)

బ్రతుకుయొక్క అసలుబరువును గూర్చి ఆదేశించినది హేమ.

"తిష్య లశాశ్వతలు. భారతసింహాసనమొక అతీతస్థానము. సంప్రాప్తలుకాని తిష్యలు సామ్రాజ్యప్రజామాలికలోని మణిస్థానముల కెక్క బ్రాకరాదు! నీ బ్రతుకుబాట లెటుపోయినను నీవే నిర్మించుకొనవలసి యుండును." (అవగుంఠనము సద్దుకొని)

ప్రవీణా, తలుపుతీయుము. కుణాలకుమారుని హేమ యొద్దకు తీసికొనిపొమ్ము.

(తెరలో)

ఏమి మహారాజ్ఞీ?

తిష్యరక్షిత

వద్దు. హేమనే యిటు తెమ్ము. కుణాలా, నన్ను కాదనకుము. శిరిరా మోకాలొడ్డకుము.

తాతకు తండ్రికిన్ నృపతిదానధునుల్ సరిగా; నమిత్రర
క్తాతత తర్పణాల పయినాళి. భగీరథుమించి, రుద్రుఁగే
త్రాతత కీలలన్ దిగిచి, ఆ నిశితాగ్నుల శత్రుపిండముల్
ప్రీతి నొసర్పుమీ! భరతవీర్యము నిల్పుమి! వారి మించుమీ!

ఏమట్లు నివ్వెరబోయి చూచెదవు కుణాలా? అశోకుడట్లు చేయునని యెంచితిని. కానిఅట్లు చేయించను లేకపోతిని. మన మిద్దరమును కలిసి అట్లుచేయవలెను. తెలిసినదా? రమ్ము. నాచేయి పట్టుకొనుము.

కుణాలుడు

నీవు తల్లివి.

తిష్యరక్షిత

తల్లిని! నేను వివాహమాడదలచినది కాలాశోకుని. ప్రియదర్శిని కాదు. తెలియునా? నే నా కాలాశోకత్వమును నీలో ఆవహిల్లచేయుచున్నాను......

ఏమి సందేహించుచుంటివి కుణాలా? రక్తపిపాసియగు రమణికి హృదయముండునా యనియా?......ఉండును. వ్యాఘ్రి, స్వీయసంతానము దిగద్రావుకొను వ్యాఘ్రి, ప్రేమికు నెంత ఆరాధించునో నీకు తెలియదు. ఆత్మజములకై ఆకలిఁ గొను విషనాగిని జంటకట్టి, పింపిళ్ళికూాయు సౌందర్యము నెఱుగవు నీవు. అగ్ని కద్రువు లుండవు; సరికదా, హావిస్సంయోగమున నుప్పొంగిపోవును.

కుణాళుడు

స్త్రీత్వగౌరవ ముకుటవిశేషమైన మాతృమూర్తిత్వమిట్లు గామడచి పెట్టుకొన్న మిమ్ము సంబోధించుటన్న నెట్లు? మాత! మన్నించుమమ్మ కుమారుగృపను.

భీభత్సచేతస్కుడగు పుత్రునెడ ప్రసన్నురాలవుకమ్మ. సెలవొసంగిన పోయివత్తును. (మోకరిల్లును)

తిష్యరక్షిత (తడవి, లేపి)

వెళ్లిరమ్ము. ఎక్కడికి పోయెదవు?

కుణాళుడు

హేమను చేరుదును, ఆమె సాహచర్యమున రక్షక సైన్య మధ్యముననున్న ట్లెంతో ధైర్యము, బలము నుండును.

తిష్యరక్షిత

ప్రవీణా! హేమమాలను కారాగృహముననే ఉండ నిమ్ము. ఇక్కడకు రా నవసరము లేదు. (వెలుకఅచుకొనును)

కుణాలుడు

కారాగృహమున నున్నదా తల్లీ, నా హేమ? (చేతులు పట్టుకొని) కీడేమియు తలపెట్టలేదుకదా నా బ్రతుకు వెల్గు నెడ ?

తిష్యరక్షిత

నా హృదయమునకు కాని ప్రార్థన చేయుచున్నాను. కుణాలా! నీ హేమ కేకీశును కలిగించనులెమ్ము. మమ్మిద్ద ఱిని చెఱియొకచేతను లాలించుకొందుమనని బాస యిమ్ము,

కుణాలుడు

నాహృదయమున సింహాసన మొక్కటే యున్నది. అది ఆక్రమితము, హేమ కందుపై సర్వస్వామ్యములు ధారాద త్తము చేయుబడినవి. నానా కామినులకం దిఅవు దొఱుకదు.

తిష్యరక్షిత

కుణాలా, వ్యాఘ్రిని కోరపట్టుకొని ఆడించుచున్నావు. తెలియునా? విషనాగము తలమణిని బట్టి ఆడుచున్నావు. పరిణామ మెఱుంగుదువా? .. కింకరా, చువ్వ లెట్టిగ కాలినవా?

నీకన్నులకుగాను నిన్ను ప్రేమించితి నయన సుందర, నయనజితలోక,

నీ యీ నయనమహనీయ రోచిస్సులకనుగొని నీ హేమ గర్వపడునో,

సతము నే నయన విస్ఫారితోపస్సల నాత్మలోలత నీవు సహముగొందు,
ఏ ఆత్మరుచిర దృగీషుజిత యువతీహృదయ మహాత్ముల కిగురుతివ్వ,
అట్టి నీఅందమును బెంచు అందమైన కనుల, నీవు, హేమయు గర్వపడెడు
కనుల, నీప్రాణవశా హేమ కనులముందె ఆర్పివేతు నాలోచించుమందగాడ!

(కింకరుడు కాలిన చువ్వలతో వచ్చి నిలబడను. కుణాలుడు కొంత తెల్లబోయి, ధీరుడగును)

పొమ్ము, చండాలుడా, అందుంచి పొమ్ము. ఏమి నయనసుందర, చూచితివా? కింకరా, ఇటురమ్ము, పిలిచి నప్పుడు ప్రత్యక్షము కావలెను, పొమ్మింక.

(కింకరుని ప్రస్థానము)

కుణాలుడు

మాతృమోహాకములుగూడ నయిన యీ నయన సౌందర్య మణగిపోవలసినదే! నే నందుల కిష్టపడుతున్నాను. లోకములయొక్క ఆదర్శస్థానమునుండి తల్లిని జార్చు ఈ నయనజ్యోతు లారవలసినదే. కాని, ఒక్క ప్రార్థన. అంతకు ముందు నా హేమతో నాకొక యేకాంత క్షణముగావలెను. అంతియే కోరిక ......ఏమి? మాట్లాడరు!... ఇక్కడికే పిలి పింపుడు...... దేనికో కాదు, ఏదో చెప్పను.

'మన ప్రేమకుం గల్గు మహిత పరాకాష్ఠయన్న నెంతయు నింతకన్న లేదు
మన లోకహితజీవ మహాదుదంతమునకుం దలచినంత పరమోత్కృష్టయిదియె
మానవాతీతవశా మన జీవితోదంతమున కనుకొన్నట్టి ముకుటమిదియె
మన జీవితక్రియా మహితనిర్వహణలో నిట్లు తోడ్పడు మాత ఎంతో శ్రేయ
జనని నే అపార్థము చేసికొనగరాదు, అనుమతింత మిష్టమునైన' ననుచు నచ్చ
దెలిపి, ఓదార్చి, ధైర్యము గొలుపుకొందు. (దిగ్భ్రమింగి)

పిలిపింపుము మాతా.

తిష్యరక్షిత (గుండె బల్లెముతో, తనలో)

ఆః! ఆః!... అమరుడవు కుణాలా, నీహృదయ నిసర్గవినిర్గత మగు నీ దివ్యమహోదయవాహిని తిరోవాహినియై — యీ క్షుద్రమూర్తుల దేర్చ నేతెంచుటది మాసౌభాగ్యము! ఏమి! ఏమి త్యాగమహస్సు!...... అబ్బ! ప్రాణములు సిగ్గుచే మెలి తిరుగుకొనిపోవుచున్నవి. (ఆలోచించి) అందుకనియే ఇతని నాహారించవలెను. (పైకి) సరే. మఱొక దినము గడు వొసంగితిని. ఆలోచించుకొనుము...కింకరా, వీనిని పాతాళ గృహమున నుంచుము.

(కింకరుడు ప్రవేశించి చేయిపట్టుకొని, తీసికొనిపోవును)

తిష్యరక్షిత

నిస్పృహాప్రళయమహాంబు నిధుల దేల్చి, స్వర్గసీమల జేర్చగాజాలు మల్లె పూలనావ లీకన్నులు బోసగియుండ జలమయములోన నేనుండవలయు నేమి?

తృ తీ య ర ం గ ము



(బందిసౌధము — కవాటము ముందు రక్షకభటుడు, లోపల ఇటునటు ప్రచారము చేయుచు)

హేమమాల

ఎవరవు నీవు?—రక్షకభటుడవా? నేను బంధితురాలనా?

రక్షకభటుడు

(ప్రచారము మాని- స్తబ్ధతతో నిలిచి, ఖడ్గముతో నమస్కరించును)

హేమమాల

ఏమి, మాట్లాడవు?......కారణము ?

భటుడు

చిత్తము.

హేమమాల

చిత్తము సరే, కారణము.

భటుడు

అజ్ఞుడను.

హేమమాల

కావచ్చును. పోని. ఎవరి ఆజ్ఞచేత?... రాణీయాజ్ఞ చేతనా?

భటుడు

(నమస్కరించి తల వంచును)

హేమమాల

తెలియదు. పోని. చక్రవర్తి ఎచ్చట? మహాజనుల మొఱ యేమయ్యెనో?

భటుడు తెలియదన్నట్లు నమస్కరించి, తొలగిపోవును. తిష్య ప్రవేశించును

హేమమాల (బోనులో సింహివలె తిరుగుచు)

నేను బద్ధను. కారణము చెప్పువారు లేరా?

తిష్యరక్షిత (తలుపుతీసి)

కావు. నీవు విముక్తవు.

హేమమాల (పోఁబోవుచు)

అయిన, చక్రవర్తి యెచ్చట?

తిష్యరక్షిత (నవ్వి)

ఇంకను ఆ రున్నవిట్టివే రక్షిత ద్వారములు దీనికి.

హేమమాల

ఐన అక్కడికినీ నీవేవచ్చి, విడిపింపుము... నవ్వుచు న్నావా? పోనిమ్ము. నీవెందుకు వచ్చినావు? పంజరములో నుంచిన సింగపుపిల్ల గింజుకొనుటను చోద్యము చూడ వచ్చితివా?

తిష్యరక్షిత (విషపునవ్వుతో)

ఒక శుభవార్త తెచ్చితిని.

హేమమాల

శుభవార్తా?... ప్రభువు దర్శనమిచ్చినాడా నా ప్రజకు? యువరాజు విషయ మేమన్నాడు?

తిష్యరక్షిత (వికటముగా నవ్వి)

అదికాదు. నీకు వివాహాము నిశ్చయించితిని... వరుడు నీయిష్టుడే యగునులెమ్ము—భరతఖండమున నీకు నచ్చిన వరుని స్వయంవరము చేసికొనుము. ఒక్కడుతప్ప, (ఆవేశ ముతో) కేవల మొక్కడుతప్ప.

హేమమాల

ఒక్కడా? యువరాజేనా? అతనిని నీవేమైన ప్రత్యే కించుకొనబోయెదవా? భానునికి పద్మినికాదని వేరొకసంబంధమా తిష్యా?

తిష్యరక్షిత

తిష్యా?— రాణీఅనుము. మఱి యువరాజుకు సంబంధము కుదిరినది. అంతకుముందే నీ వివాహమైపోవలెను.

హేమమాల

కానిమ్ము. రాణీ, నా వివాహవిషయమై నీ కెందుకింత ప్రయాస పాపం?

తిష్యరక్షిత

అవును. నీకు తెలియని రహస్యము కాదు. నీవు మా మధ్యనుండి తొలగిపోవలెను.

హేమమాల

నీవు రాణివే! ప్రియదర్శికి పత్నివే! ద్రోహమునకు, పాపమునకు జంకవా?

తిష్యరక్షిత

మా వివాహము శాస్త్రీయము కాదు? నేనశోకపత్నిని కాను. కాని రాణినే. అయిన నీకెందుల కా విషయమంత?

హేమమాల

రాజులలో గాంధర్వము శాస్త్రీయమే.

తిష్యరక్షిత

సరి. నీతో శాస్త్రచర్చకు రాలేదు. నీ వెన్నుకొన్న సరియే. లేకున్న, ఆభారముకూడ నేనే.వహింతును. జేపే నీ వివాహము——ఈడు వచ్చిన పిల్లకు పెండ్లిచేయకరచ్చకెక్కించినారు——ఆలోచించుకొనుము. త్రేపే ముహూర్తము. వివాహ మంటపమే యిక్కడకు తరలివచ్చునులెమ్ము.

(ప్రస్థానము)

(తిరిగి కింకరునితో, కాలిన చువ్వలతో ప్రవేశము)

నీవు మోహాయోగ్య వయినంతవఱకు యువరాజు హృదయము మఱొకరికై మఱలదు. చూడు మీ సలాకలు. వీనితో నీకన్నులుతోడి, నిన్ను కురూప నొనర్చివేతును. (సైగచేయును. కింకరుడొక అడుగువేయును.)

హేమమాల (కంపించి, ధీరయై)

తిష్యరాణీ. నీయీయూహాలో నీమహోన్నతసౌందర్యమునెడ ధిక్కార మొనర్చుకొనుచున్నావు. కేవలము సౌందర్యమునకే హృదయములు ముగ్ధముకావలెను కాని, గరీయమగు తిష్యసౌందర్యముముందు హేమ సౌందర్యము కురూపమే!

తిష్యరక్షిత

ముఖస్తోత్రముతో నాదృఢసంకల్పమునుండిదూరము చేయజూచుచున్నావు; నేనంత వెఱ్ఱిదాననా?——కింకరా,

(కింకరుడు ఒక అడుగువేయును)

హేమమాల

పోనీ, కుణాలునే అడుగుము. నా సౌందర్యమునే అర్థించెనో, లేక...

తిష్యరక్షిత

లేక నీవ్యక్తినే కేవలమర్థించెనోఅని. (ఆవేశముతో) అందులకే నీకనులారిపోవలెను. నీవు సర్వమునకు నశక్తువు కావలెను. నన్ను ప్రేమించుచో నట్టి కుణాలునిపై నా విజయము విని నీవు క్రుళ్ళవలెను.

హేమమాల

సంకల్పమున మావివాహ మైపోయినది. నాకన్నుల లోని వెలుగును హత్యచేసితివా, ఆచీకటియే నన్నుమఱింత లోకప్రియ గావించును.

తిష్యరక్షిత

నాకు కలిసిరాని సౌభాగ్యము లోకమునుండి వేరు పడవలెనని, నా కందరాని సౌందర్యము వెలుగుమొగమే చూడరాదని, మహాజనమండలి పాతాళగృహమున నంధుడై బ్రతుకీడుచున్నాడు నీ కుణాలుడు. నీవునుపొమ్ము. అంధపశువులిద్దఱును కలిసియే నెత్తురూర తపించి, యేడ్చి, బ్రతుకు చీకటులలో చివికిచావవచ్చు. పోనీ, ఆచీకటి గదిలో కూర్చుండి విప్లవములు లేవదీసెదరుకాని, రాయబారములు నడిపెదరుకాని!

హేమమాల

హా! రాక్షసివినీవు. చేసివేసితివా అంతపనియు? ఆశ్రయించు మా కబోది నింక... హృదయము నను శాంతి దొరుకగలను.

తిష్యరక్షిత

నా కా అంధకురూపితో నింకపని? (నవ్వి) కింకరా చూతువేమి? నేను రాక్షసిని!...ఊఁ!

(కింకరుడు పొడువబోవును. హేమ ఆ సలాకలు తీసికొనును.)

హేమమాల

వలదు. కింకరుని కేల ఆపాపము! నేనే స్వయముగా పొడుచుకొందును. ఆయనకు లేని కన్నులు నాకుమాత్ర మెందుకు? ఇప్పుడు నీవు వద్దన్నను నేనే హృదయ పూర్వకముగా అంధురాలను కానున్నాను. (కన్నీరు) కుణాలునికి హేమకు కాదు నీ విచ్చు అంధత్వము. దర్శకులను తప్పించి, దేశమునే గ్రుడ్డిదానిని చేయుచున్నావు. అంతఃపురము మూఢాధికార గర్వమున నీకనులు పూడిపోయినవి. వ్యక్తిత్వమును చంపి, వృద్ధరాజునెప్పుడో అంధుని చేసితివి. ఆ ఫలితమగు నీ పరిణామ మంతయు నిట్లుసాగిపోవలసిన దే. ఎవరును తప్పించలేరు. నీవును!...ఏమట్లు తెల్లబోయెదవు? రేపు దేశముకాని, అధిపతికాని కనులు తెఱచినప్పుడుండును నీపని...కానిమ్ము నా కెందు కదంతయు. నా బ్రతుకుతీరు నిర్ణయ మైనదికదా! (కన్నులు పొడుచుకొనబోవును.) హా!

అశోకుడు (ప్రవేశించి)

ఆ! ఆ! మతిచెడ లేదుకదా. (లాగిపారవేయును సలాకలను)

తిష్యరక్షిత

ఏమమ్మా, ఏమంత జీవితముపై అసహ్యము కలిగినదా? ఎందుల కట్లు నయనహత్య చేసికొందువు? చక్రవర్తికి చెప్పమేమందురో.

హేమమాల

ప్రభూ, నాకీ కనులువద్దు. ఈ కను లేడ్వను లేవు. ఈ ప్రపంచమున నాకింక చూడవలసినది లేదు.

తిష్యరక్షిత

ప్రభూ, మీరెందుకిట్లు తెంచినట్లు? వైద్యుడు లేవ వద్దని చెప్పలేదు?...కింకరా, ఈమె నిండేయుంచి కనిపెట్టుచుండుము. పిచ్చియెత్తి యుండును పాపము! ఇంక దేమియు లేకుండ చూడుము. ఏవేళ కేమి బుద్ధిపుట్టునో ఇంకనలుగురను బిలిచి, పదికన్నులతో జాగ్రతపడుము.

(అశోకుని గొంపోవును)

## చతుర్థరంగము

✶

పాటలీపుత్ర వీధులు—తెరముందు—సాధు, మాధు పాటపాడుదురు. (ప్రజలు మూగి, వినుచు వెంటబోవుచుందురు.)

కర్మాగారము లుదయమందకే
ధర్మాగారము లస్తమించినవి
అసిధారావ్రత మనుగమించకే
బౌద్ధమతమునకు పుట్టిమున్గినది.
ఝురిదారి నెరిగి యడుగిడరా!

రాజ్యాలేలను రక్షించగను
అహింసాయుధము అమరదు కానీ
బౌద్ధమతముపై వైముఖ్యమ్మా
దర్మప్రభువు నొకదరికి నుంచెరా!
ఝురితీరు నెఱిగివెన్నరా!

... ... ... .... .... ...

కన్నెఱచి, ఒడ లెఱిగి, కారణముతో నేమొ
దేశమున నూత్నోత్తేజ మొసగితి వీవు
సామ్రాజ్యవాదు లది సరిపెట్టుకొని స్వార్థ
ఫలములను బొందగా వలచి యున్నారురా.
అరిమందిరము చొరదవేరా!

కృషికజనుల మంత్రిత్వపు మాటకేమిరా
స్త్రీ చంచల బుద్ధి కెరల మైతి మేమిరా!
కృషికుల యాదరవు హేమ కారబడెనురా!
శ్రమిక నాయక కుణాలు డంధు డయ్యెరా!
రాణు లేతెంచి రాణు లేగుచుంద్రురా!
కాని ప్రజాశక్తి అమర చరణఝురిణిరా!

(ప్రస్థానము)

ప ం చ మ ర ం గ ము



(తెరలో) మాగధులు

జయ! మౌర్యరాజవంశ్యా! దేవతాప్రియా! ప్రియదర్శి! రాజర్షి! వితరణోహా!
సింహాపీఠస్థితక్షేమస్వాగతప్రభూ! ధర్మానుసంయానకర్మ! జయము!

జయ! అశోకప్రభూ! జయ అమిత్రాంతక! జయమాగధప్రభూ! జయము!
[జయము!

జయ! బిందుసారప్రజా! తథాగతమతోద్ధార! ధీరవ్రతా! మారవిజిత! ధర్మానుశిష్టవ్రతా! సుధర్మా! జయ! ప్రేమాయుధప్రభా! వీరవిజిత! క్షోణీమండలాంతపులకితకీర్తి రుచిర! ప్రకృతి నిబిడిత నిజగుణవందిగీత!

(తెరముందు అశోకుడు ప్రవేశించును. వెంట దూరమున అగ్వాతియశస్వి)

అశోకుడు

బౌద్ధ భారతమున నింకను నాజయగానమే వినబడుచున్నదీ?!

(తెరలో)

తిష్యరక్షితారక్షిత దివ్యరాజ్య! జయము! జయ! జయ! జయ!.........

అశోకుడు (ఉలికిపడి)

వందిగీతములను ఆహాస్త్ర విన్యాసమూ? అవును. ఆపాద మస్తకమును చుట్టిన కాలాహికను బ్రామగల్గుహా?
అహింసా దీక్షితుడ! ప్రేమాయుధహస్తుడునగు వృద్ధబౌద్ధరాజును!
దేశమున అశాంతి కంతకును బాధ్యుడను!

అశోకుడు జీవించియేయున్నాడు. అతని కనులముందే అతని స్థిరధర్మసంస్థలు, అతిసకల్పనాస్వర్గము, అతనిఆదర్శాశోక సామ్రాజ్యమురూపుతిరిగినవి! నేనేలనింకనుజీవించియున్నాను! ఏమున్నదీ కత్తిపట్టు నవసరములేనప్పుడు పురుషుడే కాదు స్త్రీయు రాజ్యముచేయగలదు!
నేనేల నిన్నిశతాబ్దములు ముందుగా జనించితిని?

(తెర లేచును)

(రాజసభ—తిష్యరక్షిత, మంత్రి రథగుప్తుడు ఉచితాసనములపై, ఒకకింకరుడు నిలువబడె అశోకునిగాంచి అందరులేచి యభివాదము చేతురు.)

తిష్యరక్షిత

ఏమి ప్రభూ, చాల దీర్ఘముగా నాలోచించుచున్నారు?

అశోకుడు (తనలో)

విషసర్పము బుసలతో పలుకరించుచున్నది. (కూర్చుండి ప్రకాశముగా) ఏమియు లేదు. ఈదినమున నాకేమియొ కనులు తెరలు కట్టినట్లున్నది. సూర్యకిరణములు నెత్తుటమ్ములవలె కనుల గ్రుచ్చుకొను నట్లుండ, ఇంతలో తెప్పలు మూతపడి, పొడుపుకొనును... ఏదో యమబాధగనున్నది.

తిష్యరక్షిత

రాత్రి నిద్ర లేకట్లున్నది! ... మహాప్రభూ, మీరు హాయిగా కన్నులుమూసికొనుడు... నేనీరాజ్యము చేసి పెట్టుదును.

అశోకుడు

కాదు రాణీ! ఇక్కడనే కొంత హాయిగా నున్నట్లుండును. ఏదేని వినోదముగూర్తునని గురుదేవుడిట్లు కొని తెచ్చినాడు... కొంచెము కన్నులు మూసితినా, బందిలో బడినట్లుండును. అందులో నింకెవరివో మూల్గులు......సరికాని, కుణాల కుమారు డెక్కడ? వైశాలిలో నేనా? తిరుగుముఖమైన ట్లేమైన... ...? మొదట మన ..కాదు, నీ ఆజ్ఞోపసంహార పత్రము నాత డెక్క డందుకొన్నాడు?

తిష్యరక్షిత

వార్త రాలేదు.

అశోకుడు

అయ్యో! నా కనులలోని వెలుగు నెవరో తోడుకొన జూచెడిని!

అర్హాతయశస్వి

గాయకుల బిలిపింతునా?

అశోకుడు

అదే అనుకొనుచుంటిని, కన్నీరు గుండెభారము తగ్గించు ననికదా. శోకరసము బాగుగ పుట్టింపగలవారేనా?

అర్హాతయశస్వి

చిత్తమొక అంధగాయక దంపతు లున్నారు. చూడ, నిరాశాజగత్తున నీదుచున్నట్లుందురు. ఏలికదర్శన మర్థించి వేచియున్నారు.

అశోకుడు

అంధులా? జాత్యంధులా?

అర్హాతయశస్వి

కాదు. ఉద్యోగులుకూడ నగు నవ్యాంధులని విందును. జాత్యంధుల కొకప్పుడు జీవితముల వెలుగుండును కాబట్టి, పోవున దుండునా? అట్టివారేద్వ లేరు. వారి కృత్రిమ దుఃఖమితరులలో నా రసము నంతకంటెను పుట్టించలేదు.

(సైగచేసి కింకరు నంపును)

అశోకుడు

ఎన్నాళ్ళయినది వారు పాటలికి వచ్చి?

అర్హతయశస్వి

కనుగొందము. ప్రభూ, ఏమఱుపాటున జూచిన అచ్చము వాడు మన కుణాలుని తలపించును.

(తిష్యరక్షిత కంపించి, అర్హతయశస్విని సందేహించును)

అశోకుడు

ఆఁ... రాత్రికల, అబ్బ! భయంకరము! హేమా, కుణాలుడు కారలోనున్నారు. చీకటి మూటలు కట్టి ఏదో స్త్రీ హస్తమువలెనున్నది. వారి తలలపై నుంచుచున్నది. అప్పుడు గురూత్తమా, మీరును ఉన్నారు చెంత. నాహృదయమునుండి ఒక జ్యోతి వెలువడి మీ కన్నుల ప్రవేశించినది. మీ దృక్కుల వెలువడిన మెఱపున కామూటలు చితికి చెరిగిపోయినవి వెల్తురులోతడిసి. దానితో ఆ హస్తము, ఆ స్వప్నము అంతయు చెరిగిపోయినది.

(ప్రవేశించి; అభివాద ప్రత్యభివాదముల యనంతరము కూర్చుండి)

ఉపగుప్తుడు

రేపు ప్రభుపట్టాభిషేక దినమునకు ధర్మార్థము వెచ్చించ దగిన ధనప్రమాణము నిర్ణయించవలెను.

అశోకుడు

రథగుప్తుడు తొమ్మిది ఆగారములే నిండుగానున్న వన్నాడు. ఇతర వ్యయములు తగ్గించి, ఉన్నదంతయు ధర్మార్థము వ్యయించిన?

అర్హతయశస్వి

ఏలినవారికి కీర్తి పెట్టి యెత్తినట్లున్నది. కాని ధనాగారము ఖాళీ చేయుట తలపెట్టినచో పాలనావ్యయమునకు క్రొత్త సుంకములు వేయవలసివచ్చును.

తిష్యరక్షిత

దానివలన ప్రజలలో నశాంతి ప్రబలును. తిరుగుబాటును ప్రబలవచ్చును. ధర్మకార్యములచే నేలిక యశము పండవచ్చును. కాని మంత్రులు ప్రజాదరణ కోల్పోదురు.

ఉపగుప్తుడు

ప్రజల సౌశీల్యపు బహుమానములు?

అర్హతయశస్వి

బహుమాన నిర్ణేత లశోకులు, ఉపగుప్తులు కారు. నిర్ణయమునకు తగు కొలత లేదు.

అశోకుడు

ఉత్సవములే ఆపుకొనవలసివచ్చునే?

అర్హతయశస్వి

చిత్తము. అదియే కొంత మంచిది.

అశోకుడు

అందఱును మా కడ్డమేనా? గురు, మీకును ఇట్టి విష్టము కావా?

(తిష్యరక్షిత నవ్వుకొనును)

ప్రభువు నేనా? లేక మీలో నొకరా?

ఉపగుప్తుడు

శెలవు ప్రభూ. ఇవన్నియు నీ బౌద్ధరాజ్యమున స్థిర సంస్థలనుకొన్నాను. ప్రియదర్శి ఆస్థానమున నుపగుప్తుని కింక స్థానము లేదు కాబోలు! (ప్రస్థానము)

అశోకుడు (కోపముతో లేచి)

ఇదిగో! గురుపాదారామమునకు సువర్ణశత కోటి వాగ్దానము చేయుచున్నాను. రాజ్యాదాయముతో నది తీరునటుల సామ్రాజ్యమును అందలి భిక్షువులకు ధారాదత్తము చేయుచున్నాను—నేనును వచ్చుచున్నాను గురూ.

అర్హతయశస్వి (పట్టుకొని కూర్చుండబెట్టి)

ఆవేశ మెందులకు కూర్చుండుడు. ఎదుట చూడుడమాత్యు డర్హతయశస్వి, రాణి తిష్యరక్షితాదేవి (తనలో) రాజులోని యీ లక్షణము బౌద్ధమతము తెచ్చిన నపుంసకత్వము! జాతికే ఇది పతన కారణము.

ఒక భటుడు (ప్రవేశించి)

తమ పట్టాభిషేకదిన సందర్భమున నాచారము ప్రకారము విడువబడిన బంధితు లిండ్లకు నచ్చుచునే త్రోవలో దోపిడులు సాగించుచున్నారు. తిరిగి కొందరిని బంధించవలసి వచ్చినదని శ్రీ చండగిరికులవారి మనవి.

## అశోకుడు

కాను. అంతటిని బంధించు మనుము. తోచు తలపు శుభకరమో, కాదో తెలిసికొనలేని మానస పరిస్థితిలో నున్నాను. (తలపట్టుకొని కూర్చుండును)

(అంధగాయక దంపతులు ప్రవేశపెట్టబడుదురు, వారు దూరమునుండియే అభివాదములుచేయుచు, తడవుకొనుచు ప్రవేశింతురు)

## అర్హతయశస్వి

(కూర్చుండ సైగచేసి) ప్రభూ, శెలవు... గాయకులారా, ఒక్క విషాదగీతి.

## తిష్యరక్షిత (కంపించి, లేచి, సర్దుకొని, తనలో)

కనులు పొడిచి హేమా కుణాలుర నెందు వదలిరో? ...వారే కారుకదా? పాతాళగృహమున నుంచవలసినది.

## అర్హతయశస్వి

దేవీ, లేచితిరేల? స్వేదముగా నున్నదా?

## తిష్యరక్షిత

ఊఁ!... లేదు, లేదు. ఏదో జ్ఞాపకమై.. (కూర్చుండి) వీరు నాట్యగానము చేయుదురా?

## అర్హతయశస్వి

(ధ్వనితో) కనుగొందము దేవీ, గ్రుడ్డివారుచేయు

వికృతి నాట్యములో మాకింక ఆనందముంటుందా? నీ పేరు గాయకా? నీవు శిలలను ద్రవింపచేయగలవా?

అంధగాయకుడు (గొంతు సవరించుకొని)

మాకా శక్తియే లేకున్న మేమింక బ్రతికియుండ లేము. ఒక్క క్షణమైనా నాకు పేరు లేదు. మేము జంటపూవులము

వేరు తొడిమల బూసి చేతులు యొకచోట
మా లోకహితచింత మాపాపమైపోయె
లోకమున సౌందర్య మొక లోపమైపోయె
లోకసంగ్రహవృత్తి ద్రోహమ్ము కాజొచ్చె ॥ వే ॥

(తిష్య మోము తుడుచుకొనును)

అశోకుడు

రాత్రి కలలో ఈ పాటే విన్నాను.

అంధగాయకులు

మా పూలలోనుండి మము వేరుచేశారు
మా వెలుగు మాపేసి, మా ప్రాణమలిచారు
మా పాదులోనుండి మము త్రవ్వివేశారు
సేవాభిలాషలో చివికిపోయినాము ॥ వే ॥

(తిష్య తలవంచి, చేతులలో నుంచుకొనును)

అశోకుడు

మొగముకూడ నిశ్చలమున్నది. ఇందులోనూ కునాలుని పోలికలున్నవి.

అంధగాయకులు

లోకముల వెల్గించు లోకబాంధవులను
ఏ గుహాల లోపలనో, ఏ చీకటులలోనో
బ్రతుకు లీడ్వగా బడవేసియున్నారు
నట్టడవు లీదగా నవ్వేరు మముజూచి ॥ వే ॥

తిష్యరక్షిత (లేచి)

తలనొప్పి! (తలపట్టుకొని కూర్చుండును) అబ్బ!

అశోకుడు

ఇతని కంఠస్వరమున పుత్రుని చాలికలున్నవే!

అంధగాయకులు

పుట్టుటకు త్యాగాన గిట్టనే పుట్టాము
కోరుకొన దుఃఖమునె కోరుకొంటిమి కాని
లోకముల బరువుతో మూల్గ ముదమొందాము
స్వీయభారాలతో చివుకగా జేశాము ॥ వే ॥

తెరలో

ప్రజాశక్తి విజృంభించినది! కారాగృహము నేలమట్టమాయినది! ప్రజాతండము లిటేవచ్చుచున్నవి.

అశోకుడు (లేచి)

గాయకులారా, పొండు. త్రొక్కిడిలో చచ్చిపోగలరు! ఏమి వ్యాఘాత మిది?

అర్హ్హతయశస్వి

మీగదిలో విశ్రమించుడు. కింకరా, ... (తనలో) ఆ. ఏర్పాటు లన్నియు సక్రమముగనే జరుగుచున్నవి. ఆమె వ్రేలి చేతనే ఆమె కన్ను పొడువబడుచున్నది.

తిష్యరక్షిత (లేచి)

తల పగిలిపోవుచున్నది. క్షమింపుడు ప్రభూ. ఇప్పుడే వచ్చెదను. (తనలో) ఆ గాయకులెవరో తెలియవలెను. (పైకి) ఆ కల్లోలమేమొ కనుగొందును. (పోబోవును.)

అర్హ్హతయశస్వి

కింకరా, సంగతియేమొ కనుగొనిరమ్ము. అమ్మా, (ఆపి) దయచేసి యీ పత్రములు తిలకించుడు. ఎచ్చటివో నాచేత బడినవి

(కొన్ని పత్రములు రాజున కందించును)

తిష్యరక్షిత (జనాంతికము)

మునిగిపోయినది. సర్వము బాహిరము. సర్వనాశము.

(ప్రస్థానము)

అశోకుడు (చదువును)

"కార్తీక బ 13 : అశోకనరకాధిపులు, శ్రీ చండగిరికులవారికి—
మహారాణి తిష్యరక్షితాదేవి ఆజ్ఞ:—

రాజధిక్కార నేరములకై పాతాళగృహమున బంధించిన హేమ

సూలా కుణాలురను ఈరాత్రియే కన్నులు తీసి...మహాజనారణ్యమున దూర మార్గమున విసవవలెను.

—రాణి తిమ్మ''

హా! హా! కుమారా! (పత్రము క్రిందపడును.) ఇంత ఆకస్మిక కురారాఘాతమా? (కూలబడి) తరువాత నీవును పోయి యుంటివా పిశాచీ, కన్నులలో పన్నీరుపోసికొనుటకు? అబ్బ! కాటువడితిని! పమభుజంగీ, తిమ్మా, ఇక్కడ వేసితివా మొదటికాటు! ఇదేమి? భూమ్యాకాశము లిట్లు చప్పరించు కొనుచున్న వేమి? బిడ్డల కన్నులు తీసి... అరణ్యమున! హా తండ్రీ, కుమారా, వచ్చుచున్నాను. ఈ అబలుని, ఈ పుత్ర ద్రోహిని స్త్రీలోలుడని, పిశాచ ప్రకృతియని, ఒకకంట నమ్మ తము, ఒకకంట విషము కురియువాడని, అసమర్థుడని, దుర్బ లుడని, ఎంతగా భావించితివో! ఓ జ్యోతిఃలారా, తమోనరక మున కూలిపోవునప్పుడు, ఆ ప్రాణబాధపడునప్పుడు, ఆత్మ రక్తమున స్నానముచేయునప్పుడు హా! తండ్రీ, ఎవరినెంతగా తూలనాడితివో! నేను బ్రతికియేయున్నాను. నాలో నుసురు లున్నవి. కాని నాకు తెలియకయే నాస్వీయములకట్టి యన్యా యములు!...తప్పింపలేక. సహించవలసివచ్చినది!... ఇప్పటి వఱకిందే యుంటివి. చెప్పితివి కావేమి?... హా! చెప్పకొం టివి. నేనే తెలిసికొనలేకపోతిని. లేచి కౌగిలించుకొననైనలేక పోతిని. ...నీ అపరాధము లేదుకదా? గురు, (మంత్రి పాద ములకు జుట్టుకొని) నా పుత్రునొద్దకు గొనిపొండు ... రాణీ, నీకుగాని రాజ్యమునకు గాని అపకారమేమైన చేసినాడా?

అగ్నాతయశస్వి (లేపి, కూర్చుండబెట్టి)

అవు నతని కన్నులలో మాతృమోహకములు, నారీ శీలభ్రంశకములు నగు రాకాజ్యోత్స్నలు కాపుర మేల చేయ వలెను? రాణిని కా లోక మతనినే ఆరాధించుట దేనికి? అతి ఛ్ఛానర్పుకున్నను సివి యతని నేరములే.

అశోకుడు

నాతో చెప్పనైన చెప్పకయే, ఇంత ఘోరశిక్ష నొసగి చర్యకూడ జరిపితి వేమి? అవును. నీదోషమే లేనిచో చెప్పియే యుందువు. ఆఁ...గుర్తువచ్చిది అవగుంఠనములోనిఆ స్త్రీసంగతియేమొ కాని ఆ యంధునిలో కుణాలుని పోలిక లున్నవి. అతని పాటలో పుత్రుని చాలిక లున్నవి. మధ్య మధ్య నీవు కంపించితివి. స్వేదము క్రమ్మినది. తుదకు నీశిరస్సే నీకు భారమైపోయినది. (ఉత్తరముచూచి)—ఏమిపిశాచీ, ఎంతభయానక చిత్తవృత్తి నిది? కనులు తీయించుటతో పోక ఆచీకటిలో కొంత, మనఃప్రళయమున కొంత మహాజనమున బడియాడుచుండ బంచితివా?.... ఆముండ్లకంపలు, మిట్టపల్లములు!...అబ్బ! ఆ నరకబాధ నీకు దర్శనీయమై కనులలో తేనియలు ముసురుకొన్న ట్లానందావధి జేరియుందువు. విషముపోసికొన్న ఆ కన్నులతో నన్నేమని చూడగల్గితివి?—ఆ. మొగము చెల్లకయే వెళ్ళిపోతివి. గురూ, ఆ గాయకుల కడకు కొనిపొండు. తథాగతా, ఈకాలములో నీ బౌద్ధసామ్రాజ్యము కరిగిపోయినది! నీ పతాకము వితావితమైనది! మనము వేయు ధర్మపు పునాదులు కదిలిపోయినవి! సైతాను

మారుని నీవు కనుక జయించగలిగితివి. ఈ రూపమున వచ్చి యీ విధముగా చేయిచేసికొని, కసి తీర్చుకొన్నాడు. నేను నీకార్యము చేసిపెట్టలేకపోయిన అసహాయుడను, క్షమింపుము. ప్రియదర్శి నిజపుత్రుని కాపాడుకొనలేని సార్వభౌమచక్రవర్తి. గురూ, ఆ గాయకుల కడకు కొనిపొండు.

అర్హతియశస్వి

ఆ గాయకులు మాత్రము హేమా కుణాలురు కాక పోవచ్చును లెండు... దేవి దేయీ లేఖకూడ చూచుకొనుడు.

అశోకుడు (సంబరముతో) .

కారా? పోనీ. బిడ్డలు సుఖముగనే యుండిన నుండ వచ్చును. ఏమి గురూ! మొదటగా ఈ ఆజ్ఞ యిచ్చినను, నన్ను చూచి ఉపసంహరించుకొనియుండును. ఏదీ ఆ లేఖ?

అర్హతయశస్వి (అందించుచు)

ఈ లేఖయే ముందది.

అశోకుడు (చూచి)

అవును (చదువును)

"కార్తీక బహుళ సప్తమి: ప్రియ కుణాలా,"

కుణాలునికే ఉత్తరమా! పుత్రుని అట్లుసంబోధించవచ్చును.

"మోహమోహితమునవో, భయమునవో, నమ్మకము తిరస్కరించితివి. మొదటి మాటపై నిలిచి మొండికెత్తితివి. ఇప్పటికి పర్యాలోచన నవ కాశము కలిగియుండును. క్రొత్తపాటలు పాడుము. వెనుకటిమాట నెత్తి చెప్పనులెమ్ము."

ఏమో నర్మగంభీరముగా నున్నది!

“అవగుంఠనము లేనిదే నేను పరుల కంటబడినదే లేదు. నా ముఖపరిచయముకలవారెల్ల మన బంధువులు, అంతరంగికులు, మంత్రులు, సేవకులు. అందరినీ ఏ తక్షశిలలోనో, ఒక రహస్యసౌధమున నే విందో పేరిడి చేర్చి, బంధించి, ఒక్కరును బిలుపోకుండ, అందరినీ—ఏ విషమిశ్రితాహారమో యిచ్చి—కడతేర్చుదము. మనతో కలిసివచ్చి, నీవు జాలి తలచినచో హేమను చేర్చవద్దు. లేకున్న ఆమెను కలుపుదము.”

అర్హతయశస్వి

(పత్రము క్రిందపడగా అందుకొని పూర్తిచేయును) “రెండు మూడేండ్లు చూచి, విశేషములు తెలియవనియు, అండే, రాణి తిష్యయు మరణించెననియు ప్రకటించుదము. నీ తండ్రి? ఇప్పుడనగా బౌద్ధుడుగాని, పితృయజ్ఞము, సోదరయాగము చేసియేకదా పాలకుడైనది! ఆయన నీత నాయనకే ఒప్పగింతము. నీ వింక రాజువు. నేను నీ పాదదాసి రాణిని. పేరే పుష్యరాణి యనియో మార్చుకొందును లెమ్ము. ప్రత్యుత్తరము కాదు నిన్నే కోరుచున్నాను.

—రాణి తిష్య.”

(తెరలో ప్రజాకల్లోలము ఒకవైపునుండి ఒకవైపునకు పోవును)

అశోకుడు

హుం!...మన మిప్పుడెక్కడ నున్నాము? ఇది తక్షశిలయేనా? నీవు?

అర్హతయశస్వి

చిత్తము. పాటలీపుత్రము. రాజసభామందిరము. నే నర్హతయశస్విని. సేవకుడను.

గురు, నా బ్రతుకు తెల్లవారునా?...ఆ ప్రజావిప్లవము లావె లేవదీసినవి కావుకదా?... ఛీ! ఇట్టి పశువునా నా పూజాహృదయమున చేర్చుకొన్నది? పూజ్యమాతృస్థానము నుండి నీచపశుత్వములోని కిల్బు దొర్లిపడిన యీ ఆత్మమాంసాశనినా నేనారాధించినది? ఇట్టి ముండ్లకంపనా నా ప్రజలకు రక్షకావరణము ప్రసాదించినది? నా ప్రక్కలో పాము పుట్టినది......హా! (మూర్ఛిల్లును)

తెరలో

ప్రజాసమూహము ఇటే వచ్చుచున్నవి! వారితో ప్రభూ, యువరాజు, హేమమాలకూడ నున్నారు.

అశోకుడు (దిగ్గున కనులు తెలిసి, లేచి)

ఏమీ? యువరాజా? ఏడీ? ఎవ్వరును లేరే? అంత భాగ్యముకూడనా?

అర్హాతయశస్వి

అంతభాగ్యమును ప్రభూ. ఈ ఉత్తరము, ఆ ఆజ్ఞాపత్రము నాచే మధ్యనే సంగ్రహింపబడి, అన్నిటికిని విరుగుడులు ప్రయోగింపబడినవి. ఈదినమున నీ నాటకమాడి—

అశోకుడు

తిష్యరాణి బ్రతుకు నామెచేతనే బయటపెట్టించినది-

(హేమమాల, కుణాలుడు, ప్రజలు ప్రవేశింతురు. అశోకుడు కుణాలుని కౌగిలించి, హేమమాలను కన్నీటితోనే పరామర్శించి, అజ్ఞాతయశస్వికి మోకరిల్లును)

తిష్యరాణి బ్రతుకు బయటపెట్టించినది—

అజ్ఞాతయశస్వి

నేనే. నా కట్టుకొన్న కోటను సంరక్షించుకొంటిని. అంతియే. ఇందొకరికి నేను చేసిన దేమియు లేదు.

కుణాలుడు (మోకరిల్లి)

మహాత్మా, నాకు నయనదక్షిణ నొసగి, నా కృతజ్ఞత నాహరించితిరి.

హేమమాల (మోకరిల్లి)

నాకును నయనదాన మొసగి, పతిభిక్షయు పెట్టి, నా జీవిత కృతజ్ఞత నాహరించితిరి.

అశోకుడు

రాజవంశమునకు ప్రాణరక్ష నిచ్చి, మాయొక్కయు, సమస్తభారతము నొక్కయు కృతజ్ఞత లందుకొంటిరి. మమ్మిట్లు కన్నులలో బెట్టుకొని, రెప్పలలో బొదువుకొన్న మా జీవితముల సామూహికకృతిని స్వీకరించుడు.

తెరలో

ప్రభూ, తిష్యరాణి ఆత్మహత్య గావించుకొన్నది. మరణమునకు పూర్వము ప్రభుదర్శనము కోరుచున్నది.

(అందఱు లేతురు. అశోకుడజ్ఞాతయశస్వివంక చూచును)

15

అర్హతయశస్వి

తప్పక చూచినత్తము. పశ్చాత్తప్తయై ఆత్మావిష్కరణము గావించుకొనవచ్చును.

(అందఱు ప్రస్థానము . తెర)

(తిరిగి తెర లేవగా తిష్య మరణబాధపడుచు, హేమమాలయొడిలో శిర ముంచుకొనియుండును. అందఱు ప్రక్కన నిలబడియుందురు.)

తిష్యరక్షిత

కులవధూ, నీ వ్యక్తిమహోదయమునకు ముందు నేనొక దివానక్షత్రమును. ప్రభూ, తిష్యజీవిత మస్తమించుసమయమువచ్చినది. అంత్య వచనముల విశ్వసింపుము. రథగుప్తుని నమ్మవలదు. ప్రభుజనకుల, భ్రాతృవరుల మరణములు... కాదు హత్యలలో అతని హస్తమున్నది. అతనికి మీపైగల అయిష్టము తెలిసి యుపయోగించుకొంటిని. నాకు భారతచక్రవర్తిని నగుటలో, అంతకంటె అప్పటి నా స్వాప్నపురుషుడగు చండాశోక యాయజూకుల రక్తధారాప్రవతముల యజ్వాని నగుటలోనే వాంఛగా నుండెడిది. రక్తపిపాసకాదుకదా, నా సహజకామప్రకృతియైన మీబౌద్ధమతప్రవేశముతో తృప్తిపడకపోయినది. క్రమముగా కుణాలునికి హేమయెడ గల ఏకాగ్రచిత్తము, అతని లోకహితవృత్తి, త్యాగదీక్ష నన్ను ఇంద్రియ సంతర్పణాశతో లుబ్ధపఱచినవి. తండ్రీ, కుమారా! నీ మొగము చూడలేకున్నాను. జీవితావసానముననున్న దీనిని క్షమించితినను.

(కుణాలుడు దగ్గఱకు రాగా అతని చేయి, హేమమాల చేయి కలిపి)

జంటతారల కిరణములవలె, జంటపూవుల పరిమళములవలె, జంట వేణికల నీరములవలె కలిసిపొండు, నేను మధ్యనుండి తొలగుచున్నాను.

(అశోకుని పాదములంటి, వారి హస్తబంధము నతని హస్తమున నుంచుచు)

క్షమించుడు స్వామీ, మీ దశోకరాజ్యము. భారతము రాజన్వతి. అట్టి మిమ్మేమొ దూరితిని. దేశమునకు మీరొసగిన స్థిరసంస్థలెన్నిటినో భగ్నమొనర్చితిని. మీచిత్త శాంతికి భంగము తెచ్చితిని. మీకును, మీ ప్రజకును మధ్య నిలువబోతిని. తొలగుచున్నాను. మహాత్మా, (నమస్కరించి) మీ రీరాజకుటుంబముచుట్టు మంత్రించి గీచిన గిరి నా కవిలంఘ్యమైనది. మీ ప్రజ్ఞాజగజ్జ్యోతికి ముందు శలభమాత్రనగు నీ అల్పప్రజ్ఞను మన్నించుడు. ఒక్క ప్రార్థన. నాలో గంపెడాశ పెట్టుకొన్నారు అమాయిక కళింగులు. వారి హృదయముల నీ జీవిత విషము సోకనీయకుడు. భారత చరిత్రమున నీ క్రూరరక్కసిని చేరనీయకుడు. (చేతులు జోడించి) మహామంత్రీ, ప్రియదర్శి, బిడ్డలారా,......అందఱు క్షమించుడు. ఈ జీవి మలిన చిత్రమును మీ హృదయఫలకములనుండి చెఱిపివేసికొన్నుడు! శెలవు...

“సంపూర్ణుల్లు కాని తివ్యలు సామ్రాజ్యప్రజామాలికలోని మణిస్థానముల శోభాకరాధ్యు. నీ వెగయుద్ధమునచిన లోకదర్శకస్థానముయొక్క నియమమును [illegible] తెలుసు నీవే జారిపోదువు”

.. ...ఆ స్థానము మీకే తగును బిడ్డలారా, ఆ స్థానము మీకే. (ఆకసమువంక చూచి) శెలవు...... శెలవు.........

(కన్నులు మూయును)

(తెర)

భరతవాక్యము:

అర్హతయశస్వి (తెర ముందుకు వచ్చి)

స్వపరిపాలనలో దేశమువలకు కాని, ప్రజకశోకరాజ్యాగ్రత పట్టదేమొ!
కాని, రామరాజ్యాగ్రతగన్నభూమి శీఘ్రము మాయోగ్యతనుగూడ చెందుగాక!

* *

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 3 | ఒకదండ...) | (ఒకదండ.....) |
| 9 | 1 | మిపు | మిష్డు |
| 14 | 2 | రాప్రత్టోరణ | రాష్ట్రతో |
| 14 | 5 | సాటుకము | కంటకము |
| 18 | 7 | ఊపగుపు | ఊపగుప్తు |
| 19 | 5, 11 | ,, | ,, |
| 22 | 6 | ,, | ,, |
| 26 | 9 | విదిల్చెడ | విదిల్చెడు |
| 30 | 6 | శరణాలయంయ | శరణాలయము |
| 35 | 21 | పూ్ణ | పూర్ణ |
| 52 | గేయము — నేపథ్యగానము | | |
| 56 | 12 | ఆజత్యర్కం | ఆ జాత్యర్కం |
| 59 | 8 | తిదువిజాష్పురువ | విజాతిదుష్పురుష |
| 65 | 22 | నాయొడ | నాదునెడ |
| 68 | 21 | రయొనది | రైనది |
| 74 | 1 | చెదర | బెదర |
| 78 | 8 | (తనలో) | |
| 79 | 1 | కక్షశాల | కక్షపాల |
| 80 | 10 | సహచారిణి | సహచారి |
| 85 | 5 | సందేహించుంటి | సందేహించుచుంటి |
| 89 | 19 | ( ) లో నుండవలెను. | |
| 101 | 2 | కీరి | కీర్తి |
| 103 | 4 | కా లోకం | కాక లోకం |
| 108 | 9 | వచ్చిది | వచ్చినది |
| iv | 22 | అంముదెల్పెసరత | అంతరముదెల్పె స |

కొన్నిచోట్ల థ ధ లొకదాని కొకటి.